# ఆంధ్రప్రదేశ్
# అమ్మకపు పన్ను చట్టం





విశాలాంధ్ర ప్రచురణాలయం.
వి జ య వా డ.

# ఆంధ్రప్రదేశ్ అమ్మకపు పన్ను చట్టం

సంకలనం:

పుత్సల సత్యానారాయణ, ఎం. ఎల్. ఏ.

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ

3 2-8

# విషయసూచిక

# ముందుమాట

ఆంధ్ర ప్రదేశ్ శాసనసభలో అమ్మకపుపన్ను బిల్లు సెలెక్టు కమిటీనుండి వచ్చిన తరువాత ప్రథమ పఠనంలో ప్రతిపక్ష నాయకులు శ్రీ సుందరయ్యగారు రెండున్నర గంటలసేపు మాట్లాడినట్టు, ప్రతిపక్షంవారు సామాన్యప్రజల, సామాన్య వర్తకుల హక్కులకోసం అడుగడుగునా తీవ్రంగా పోరాడినట్లు పత్రికా పాఠకులు తెలుసుకున్నారు. కాని ఉపన్యాసములు పత్రికల్లో మరీ క్లుప్తంగా రావడంవల్ల కనీసం సుందరయ్యగారి ఉపన్యాసమైనా పుస్తకరూపంలో ప్రకటించమని కొంతమంది వర్తకులు మాకు వ్రాశారు.

కేవలం రాజకీయ అభిలాషతో చదివేవారికి సుందరయ్యగారి ఉపన్యాసం ఒక టేసరిపోతుంది. కాని ఈపుస్తకాన్ని కొని చదువుకొనే వర్తకులకు దీర్ఘకాలం వుపయోగపడుటకుగాను చట్టము, రూల్సుకూడ యిందులో చేర్చినాము.

రాజకీయ అభిలాషతో చదివే వర్తకులకు, యితరులకు బిల్లు క్లాజులమీద, రూల్సుమీద ప్రతిపక్షం యిచ్చిన సవరణలు, చేసిన వాదనలు అవసరం అవుతాయనే దృష్టితో అవికూడ చేర్చినాము.

చట్టం, రూల్సు యింగ్లీషులో వున్నాయి. ముక్కకు ముక్క తెనిగించకుండా విషయం అవగాహన అవడానికి స్వేచ్ఛానువాదం మాత్రమే చేయబడింది. అంత ముఖ్యావసరముగాదని తోచిన క్లాజులు, రూల్సు మాత్రమే విడిచిపెట్టబడ్డాయి.

మా కోరికపైన యీ పుస్తకాన్ని శ్రీ పుత్సల సత్యనారాయణగారు తయారుచేసి యిచ్చారు.

ఆంధ్రప్రదేశ్ శాసనసభలో పి. డి. యఫ్. కమ్యూనిస్టు బ్లాక్ రాష్ట్రి సమస్యలపట్ల ఎల్లా ప్రవర్తిస్తున్నదో ఈ పుస్తకం చాలవరకు తెలియజేస్తుంది గాబట్టి వర్తకులు, యితరులు కూడ దీనిని విరివిగా చదువగలరని ఆశిస్తున్నాం.

ఇట్లు,

ప్రచురణకర్తలు.



# పీఠిక

అంగక్రమముగల రాజ్యాలెప్పు డేర్పడినవో ప్రపంచ చరిత్రలో అప్పటినుండీ అమ్మకపుపన్ను వున్నట్లే కన్పిస్తూవుంది. 2500 సంవత్సరాల క్రిందట బానిసలకు పెద్ద మార్కెట్ ఐన గ్రీస్‌లో యీ పన్ను ఉన్నది. ఈజిప్ట్‌లో వున్నది. రోమన్లచే పాలింపబడినంతకాలం ఫ్రాన్సులోనూ, స్పెయిన్‌లోనూ ఉన్నది. మన దేశంలో కౌటిల్యుని అర్థశాస్త్రంలోగూడ ఉదహరింపబడింది. అనగా మౌర్యులకాలంలో యిది విధింప బడింది.

తరువాత అనేక రాజ్యాలు యీ పన్నువిధానంలో దారుణమైన మార్పులు తెస్తూ దీన్ని దుర్వినియోగం చేయడం వల్ల పరిశ్రమలు, వాణిజ్యం దెబ్బతిన్నాయని, క్రమంగా ఇదొక అపవిత్రపన్ను క్రింద పరిగణింపబడి క్షీణించిందని చరిత్రకారులు చెబుతున్నారు.

ఆధునికంగా మరల 1916 లో యుద్ధ ఖర్చులకోసం జర్మనీ దీనిని ప్రారంభించింది. అప్పటినుండి పాతికేళ్ళలో ప్రపంచం అంతా వ్యాపించింది.

రాష్ట్ర పన్నుల వ్యవస్థలో గత ఇరవై ఏళ్ళలోను ఒక ప్రత్యేక పోకడ కనిపిస్తూవుంది. అమ్మకపుపన్ను ప్రారంభమవడమే గాకుండా, భూమిపన్ను తరువాత యిదే పెద్దదైంది నిన్నటివరకు. నేడు బహుశా భారతదేశం అంతా భూమిపన్ను కంటె యిదే పెద్దదై వుండవచ్చు.

వివిధ రకాలైన అమ్మకపుపన్ను లమలులో వున్నాయి. సర్వసాధారణ అమ్మకపుపన్నూ, విచక్షణాయుత పన్ను, మల్టి పాయింటు పన్ను, డబుల్ పాయింటు పన్ను, సింగిల్ పాయింటు పన్ను, కొనుగోలు పన్ను మొదలైన రూపా లున్నాయి.

అదివరకు అమ్మకపుపన్ను విధించేహక్కు రాష్ట్రాలకు మాత్రమే వుండేది. 1956 లో రాజ్యాంగంలో 269, 286 ఆర్టికల్సునూ, ఏడవ షెడ్యూలు కేంద్ర జాబితా 92 వ హంశాన్ని రాష్ట్ర జాబితా 54 వ హంశాన్ని సవరించేరు. దీని ప్రకారం అంతర్రాష్ట్రీయ పన్ను విధించే హక్కును కేంద్ర ప్రభుత్వం తీసుకుని అట్టి చట్టం చేసింది.

పాకిస్తాన్‌లో అమ్మకపుపన్ను "అంతా" కేంద్రప్రభుత్వమే వసూలుచేసి రాష్ట్రాలకు పంచిపెడుతూంది. ఆ విధంగానే ఇక్కడగూడ చేయుమని ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఛాంబర్ ఆఫ్ కామర్సువారు ఒత్తిడిచేసేరు. కాని, విశాలమైన మన దేశంలో రాష్ట్రాల ప్రత్యేక పరిస్థితులు, అవసరాలు, అభిరుచులబట్టి ఆ పద్ధతి పనికిరాదని తిరస్కరింపబడింది.

ఈ పన్ను ఒకొక్క రాష్ట్రంలో ఒకొక్క విధంగా వుండడంవల్ల వ్యాపారంలోను, పరిపాలనలోనుగూడ క్లిష్ట సమస్యలు బయలు దేరాయి. ఎంత క్లిష్టమైనా అన్నింటిలోకి

తక్కువ ఖర్చుతో ఎక్కువ ఆదాయాన్ని తెచ్చేది యీ పన్నే గనుక, చిక్కులన్నిటికి అలవాటు పడుతున్నారేగాని పన్నును విడిచిపెట్టడంలేదు. పన్ను రాబడిలో నూటికి రెండున్నర మాత్రమే సిబ్బంది ఖర్చులకు 1953-'54 లో సరిపోయింది. సింగిల్ పాయింటు పన్నుల విధానంలో ఖర్చు యింకా తగ్గుతుంది.

భూమి పన్నులాంటివి కొన్ని ఎదుగు బొదుగులేక స్థాణువుగా వుంటాయి (ఇనెలాస్టిక్). కాని అమ్మకపుపన్ను ఆదాయపు పన్నులాగ వ్యాపారం అభివృద్ధి అవుతున్నకొద్దీ ప్రవర్తిల్లుతుంది (ఎలాస్టిక్). అనగా సాగుతుంది. దీనికి యీ స్వభావం వుండడంవల్ల రాష్ట్ర ప్రభుత్వాలకు దీనియందు ప్రత్యేకమైన ప్రీతి.

వెనుకబడిన మన దేశంలో చాలామంది స్వంతంగా వివిధ పదార్థాలు పండించుకుని, సరుకులను తయారుచేసుకొని కుటుంబానికి ఉపయోగించుకుంటారు. ఇవి మార్కెటుకు రానందున పన్నుల వలలో చిక్కవు. అభివృద్ధిపొందిన దేశాలకన్న మన దేశంలో జాతీయాదాయంలో పన్నుల శాతం తగ్గడానికివొక కారణం. ప్రత్యక్ష పన్నులు, విలాస వస్తువులమీద పన్నులు డబ్బుగలవాళ్ళమీద మాత్రం వేసి ఊరుకుంటే నూటికి పాతికమందైనా పన్నుల వలయంలోకి రారు. ప్రభుత్వానికి తగినంత ఆదాయంరాదు. కాబట్టి పరోక్షపన్నులు అగ్గిపెట్టెల దగ్గరనుంచి అన్నిటిమీదా వేసి అందరినీ వలయంలోకి తేవాలంటారు.

ఏ వస్తువుమీాద ఎంత వేయాలి అన్న విచక్షణ విష యంలో చాలా తగాదావుంది.

మన దేశంలో పరిశ్రమలు లేనందున అత్యల్ప ఆదా యంలోవున్న వ్యవసాయకూలీలు, చేతిపనివారు, అర్థ నిరుద్యో గులు అధికంగా వున్నారు. నిరుద్యోగుల సంఖ్య పెరుగుతూ వుంది.దీనికితోడు అన్ని వస్తువుల ధరలు పెరుగుతూవున్నాయి. ఈ పరిస్థితులలో ఏ వర్గంమీాద ఈ పన్ను ఎలా పనిచేస్తుందో ఆలోచించాలి.

తిండి, బట్ట మొదలగు నిత్యజీవితావసర వస్తువులకు రోజూ రెండు రూపాయలు ఖర్చయిపోగా ఒకనికి యింకా 8 రూపాయలు మిగులుతున్నా యనుకుందాం. మరొకనికి నిత్యజీవితానికి రు. 2/- కావలసివుండగా రు. 1 మాత్రమే ఆదాయం వస్తూంది. కనీస అవసరాలు తీరిన తరువాత మిగిలిన రూపాయలకు మార్జినల్ ఉపయోగపు విలువ తగ్గు తుంది. మార్జిన్‌కి దూరంగా యింకా ఎక్కువ రూపాయలు మిగిలితే వాటి ఉపయోగపువిలువ యింకా తగ్గుతుంది. కాని రెండవతరగతి వానికి జీవితావసరాలు తీరేవరకు మార్జిన్ లోపల ప్రతి పైసాకు అపారమైన విలువ వుంటుంది. వాని నుండి పన్నురూపంగా రాబట్టాలన్న దగ్గరే పేచీ. ఆహార వస్తువులమీాద అమ్మకపుపన్ను ప్రోత్సహించరాదని పన్నుల విచారణసంఘం వ్రాసింది. ఇదివరకు వేసినవారు వేసేరు కాని యింకెవ్వరూ కొత్తగా వేయవద్దని కేంద్రం రాష్ట్రాలను కోరింది. ఈ విషయంలో పి. డి. యఫ్. కమ్యూనిస్టు బ్లాక్ నైఖరి సుందరయ్యగారి ఉపన్యాసంలో వివరింపపడింది.

ఖజానాకు నాలుగు పైసలు రావడమే ప్రధానంగా పెట్టుకొని మొదట యీ పన్ను వేసేరు. అది చాలా అల్ప ప్రయోజనమే. కాని తరువాత దీని అర్థం విస్తృతం అయింది. ప్రభుత్వానికి ఒడుదుడుకులు వచ్చినపుడు యీ పన్నులో కొన్ని తాత్కాలిక సవరణలు చేస్తే ప్రభుత్వాన్ని నిలబెట్టగల సత్తా వున్నదన్నారు. దీని అర్థం ప్లానింగ్‌లో యింకా విస్తృత మైంది. రాష్ట్రంలో వివిధ పరిశ్రమల్లో పెట్టుబళ్ళ విధానం, వివిధ వస్తువుల ధరల విధానం గూడ క్రమబద్ధం చేయగలదని గ్రహించేరు. ఉత్పత్తిదారుని అసలు ఖరీదుకు—వినియోగ దారుని కొనుగోలు ఖరీదుకు మధ్యగల పరిమాణాన్ని దేశ పునర్నిర్మాణానికి అనుకూలంగా క్రమబద్ధం చేయగల ఆయుధం అమ్మకపుపన్ను (మారిస్ డాబ్). ప్రణాళికాబద్ధమైన ఉత్పత్తిని, పంపకాన్ని వస్తువుల చిల్లర ధరలక్రింద మార్చివేయ గలదు.

సోషలిజం గురించి శుష్క ప్రకటనలు చేయడమేగాని, ఆంధ్రప్రదేశ్ అమ్మకపుపన్ను చట్టంలో సామ్యవాద గుణం ఎక్కడా కనుపించదు. బ్రిటన్‌లాంటి దేశంలో మోటారు కార్లమీద అమ్మకపుపన్ను 100% వేయగా మన రాష్ట్రంలో 5%. అగ్గిపెట్టెలమీద గూడ 5%. రత్నాలు, కెంపులమీద 5%. పంచదార మీద 8%.

మొదటి పంచవర్ష ప్రణాళిక కాలంలో కొత్త ప్రాజెక్టులు మొదలైన పెట్టుబళ్ళకు కేంద్రం వాటా, రైల్వే వాటా గాక, తమ వంతువాటాగా రాష్ట్ర ప్రభుత్వాలుగూడ రు. 410 కోట్లు యివ్వాలని నిర్ణయించేరు. కాని రు. 269 కోట్లే

యిచ్చేయి. 1951-'52 నుండి 1955-'56 వరకు రాష్ట్రాలు రు. 230 కోట్లు అదనపు పన్నులు విధించాలని అంచనాల్లో అంకె వేసేరు. కాని రు. 80 కోట్లే విధించేయి. ఇందులో రు. 40 కోట్లు అమ్మకపుపన్నే. అనగా భరించగల వర్గాలు తప్పించుకుని ప్రజాసామాన్యంమీదకు భారాన్ని నెట్టివేసేరు. ఎక్కువ భూమిగలవారిమీద తరతమ వ్యవసాయాదాయ పన్ను వగైరాలువేసి రు. 64 కోట్లు రాబట్టవచ్చునని అంచనా వేస్తే, నీటి పారుదల, భూమి పన్ను మొత్తం రు. 11 కోట్లు మాత్రం అదనంగా వచ్చింది. మరణ సుంకాలవల్ల 21 కోట్లు వస్తుందని అంచనా వేసుకుంటే, రు. 2 కోట్లు వచ్చింది. కీలక స్థానాల్లోని కొన్ని వర్గాలు తమ మీద పన్నులు వేసుకో కుండా మానేస్తున్నారు. ఉన్న పన్నులలోగూడ చాలావరకు ఎగవేస్తున్నారు.

రెండవ పంచవర్ష ప్రణాళికకోసం దేశమంతా ఎక్కువ పన్నులభారం ఎలాగూ భరించాలి. దానితోపాటు అధికారంలో వున్న పైవర్గాలు తప్పించుకున్నంతమేరకు మధ్యవర్గాలమీద, క్రింది వర్గాలమీద బరువుమీద బరువు పడుతూవుంది. ప్రభుత్వానికి డబ్బు కావలసివస్తే బస్‌లు, సిమెంటు ఫ్యాక్టరీలు, చక్కెర ఫ్యాక్టరీలు నడిపి వాటి ఆదాయం ప్రభుత్వం తీసుకోదా? ఎవరిమీద ఏ పన్నులు వేయాలనే ప్రశ్నకూ, అధికారంలో ఎవరున్నారనే ప్రశ్నకూ చాలా దగ్గరసంబంధం వుంది.

కొత్తగా 1957 ఆంధ్రప్రదేశ్ అమ్మకపుపన్ను చట్టం చేయడానికి మూడు కారణాలున్నాయి. (1) ఆంధ్రలోను,

తెలంగాణాలోను భిన్నంగా వున్నవాటిని ఏకంచేయాలి. (2) పార్లమెంటులో ప్యాసైన కేంద్ర అమ్మకపుపన్ను (1956) చట్టమునుబట్టి పన్ను పద్ధతిలో మార్పు చేసుకోవాలి. (3) మిల్లు గుడ్డలు, పుగాకు (సిగరెట్లు వగైరాతో సహా) చక్కెరమీద అమ్మకపుపన్ను తీసివేసి ఉత్పత్తి పన్ను (ఎక్సైజుడ్యూటీ) మీద సర్‌ఛార్జీ వేస్తామన్న కేంద్రప్రభుత్వ నిర్ణయానుసారం మరి కొన్ని మార్పులు చేయాలి.

ఆంధ్రకు, తెలంగాణాకు కొన్ని తేడాలు

| | ఇదివరకు ఆంధ్రలో | ఇదివరకు తెలంగాణాలో |
|---|---|---|
| పన్ను కట్టవలసిన కనీస టర్నోవరు | 10,000 | 7,500 |
| వినోదవస్తువులమీద అదనపు పన్ను రూపాయికి | 9 పా. పై. | 6 పా. పై. |
| బంగారంమీద | ½% | ¼% |
| చక్కెర | 0–1–3 | 0–0–9 |
| కిరోసిన్ ఆయిలు | 0–0–6 | 0–0–3 |
| అగ్గిపెట్టెలు | 0–0–9 | 0–0–6 |
| సిమెంట్ | 0–0–6 | 0–0–9 |

ఇల్లా అనేక వస్తువులమీద పన్నులలో తేడాలున్నాయి. ఇపుడు ఆ తేడాలన్నీ రద్దు అయి ఒకే పద్ధతి అమలుజరుగుతుంది.

కేంద్ర అమ్మకపుపన్ను (1956) చట్టం రాష్ట్రాంతర వ్యాపారంమీద అజమాయిషీ చేయుడానికి, పన్ను వసూలు

చేయడానికి పన్నుల విచారణసంఘంవారి సిఫారసుల ప్రకారం చేయబడింది. ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ కాన్ఫరెన్సు కోరిన ప్రకారం యీ చట్టంలో ఆ సరుకులు డిక్లేర్డు గూడ్సు అని ప్రకటింపబడ్డాయి. వాటిమీద రాష్ట్ర ప్రభుత్వాలు ఇష్టంవచ్చినట్టు పన్ను విధించకుండా కొన్ని హద్దులుఏర్పడ్డాయి. వసూలుచేయడం కేంద్ర చట్టంక్రింద జరిగినా వచ్చిన పన్ను అంతా ఖర్చులను మినహాయించుకుని తిరిగి రాష్ట్రాలకే పంచిపెడతారు.

మిల్లుగుడ్డలు, పుగాకు, చక్కెర మీద అమ్మకపుపన్ను ఎక్కడెక్కడో వేసేబదులు ఉత్పత్తి స్థానంలోనే ఉత్పత్తిపన్ను యిదివరకు వేస్తున్న దానిమీద సర్‌ఛార్జీవేసి అదే రాష్ట్రాలకు పంచవచ్చునని కేంద్రం నిర్ణయించింది. అంచేత కొద్ది మాసములలో యిక వీటిమీద అమ్మకపుపన్ను వుండదు. ఏరాష్ట్రానికి వీటిమీద యిదివరకెంత ఆదాయం వచ్చేదో అంతకు తక్కువగాకుండా వచ్చేట్టు చూస్తామనిగూడ కేంద్రం చెప్పింది.

ఆంధ్ర, తెలంగాణాల పన్నులను సమన్వయం చేయడంలో యీ కొత్తచట్టం చక్కని మార్గం విడిచిపెట్టి వక్రమార్గాన పోయింది. శ్రీ సుందరయ్యగారి ఉపన్యాస సంగ్రహంలో యీ విషయంలోని వివరం తెలుసుకోవచ్చును.

కేంద్ర చట్టంవల్ల ఆంధ్రప్రదేశ్‌కి కొంత నష్టం వచ్చింది. నూనెగింజలు 12 లక్షల టన్నులు, బొగ్గు 18 లక్షల టన్నులు మనకు 1956 లో ఉత్పత్తి అయాయి. వీటిలో విస్తారంగా ఎగుమతి చేసేం. చర్మాలు, వాటి సరుకులు గూడ విస్తారంగా ఎగుమతి చేస్తున్నాము. వీటన్నిటిమీద

పన్నులు తగ్గించుకోవలసి వచ్చింది. కేంద్రం విధానంగూడ చాల లోపభూయిష్టంగా వుంది. దానిమీద విమర్శగూడ సుందరయ్యగారి ఉపన్యాసంలో చూడగలరు.

రు. 30,000 టర్నోవరులోపువారిని చిన్న వర్తకులని ఒకవర్గంగా ఏర్పర్చి, వారిలో రు. 10,000 మించిన అమ్మకంగల వారినుండి ఏదో కొంత లైసెన్సుఫీజు వసూలుచేసి విడిచి పెడితే రాష్ట్రంలో చాల చికాకు తగ్గివుండును. పచారీ, ఆహారదినుసులు, గుడ్డలలో వ్యవహరించే యీ చిన్న వర్తకులు లెక్కల వివరాలను వ్రాయడం కష్టం గనుక వారి కొనుగోలు బిల్లులనుబట్టి పన్ను విధించవచ్చును. దీనివల్ల స్వల్పంగా ఆదాయంతగ్గినా లంచాలు, ఎగవేతలు నిరోధించే చర్యలు సవ్యంగా తీసుకుంటే మళ్లీ భర్తీఅవుతుంది. ప్రభుత్వం యీ విధానం అవలంబించలేదు.

పన్ను అనేది లోకంలో ఎపుడు ప్రారంభమైందో అపుడే ఎగవేతగూడ ఆరంభమైందని లోకోక్తి. ఇటీవలగూడ ఇన్‌కంటాక్సులో 30%, సేల్సుటాక్సులో 50% ఎగవేత లుండ వచ్చునని ప్రభుత్వోద్యోగులే అంచనా కడుతున్నారు. 1950-'51 లో రు. 5000 లోపు ఆదాయంగల 2,36,000 మంది అస్సెసీల మొత్తం ఆదాయం 81 కోట్లు. కాని, లక్ష రూపాయలకు మించిన ఆదాయంగల 4200 మంది మొత్తం ఆదాయం రు. 188 కోట్లు అని ఇన్‌కంటాక్సు లెక్కలు తెలుపుతున్నాయి. అందు పెద్దవారిలో పన్ను ఎగవేత హెచ్చుగా వున్నట్టు "ఆదాయపుపన్ను విచారణ కమిషన్" రిపోర్టులో వ్రాసేరు.

బిర్లా బ్రదర్సు అమ్మకపు పన్ను అనేకలక్షలు ఎగవేత పట్టుకొనబోతే పశ్చిమ బెంగాల్‌లో పి. సి. ఘోష్ మంత్రి వర్గం పడిపోయిన సంగతి చాలామందికి తెలుసు.

పన్నులు అదనంగా ఎన్ని వేసినా ఎగవేతలను అరికడితే తప్ప జాతీయాదాయంలో పన్నులశాతం పెరగడానికి బదులు తరిగిపోతుంది. రాష్ట్రంలో ముఖ్యమైన పంటలకు లెక్కలున్నాయి. కాని అమ్మకపు పన్నులోకి ఎంతవచ్చిందోచూస్తే దారుణమైన ఎగవేత కనిపిస్తుంది. రూల్సులో మార్పులుచేస్తే చాలదు. దేశంలో నైతిక వాతావరణం లోపించింది. చైనాలో పరిపాలనలో లంచగొండితనం, దుబారా, నిరంకుశత్వం వీటికి వ్యతిరేకంగా 1951 లోనే దేశవ్యాపితంగా చరిత్రాత్మకమైన, బ్రహ్మాండమైన ఉద్యమం నడిపేరు. ఆ ఉద్యమం పరిపాలనా యంత్రాన్నేగాకుండా సమాజం క్షాళన కావడానికిగూడ చాలా తోడ్పడిందని భారత ప్రభుత్వం పంపినపరిశీలకులు వ్రాసేరు. అహింస, సత్యము అని గొంతెత్తి కేకలువేసే మన దేశంలో అలాంటి ఉద్యమాన్ని అంతకన్నా ముందే నడుపుకొని వుండవలసింది. మనకు స్వరాజ్యంవచ్చి పదేళ్లు గడిచేయి. ఐనా ఈ చెడ్డలక్షణాలు పెరిగాయేగాని తరగలేదు. కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వం వచ్చిన 5 మాసములలోను ఆఫీసర్లలో లంచగొండితనం తగ్గుముఖంపట్టినట్లు వింటున్నాం.

పన్ను చెల్లించే వానిలో నూతన నైతిక దృక్పథం, పన్ను వసూలుచేసే వానిలో శీలము, ఆత్మగౌరవము కలిగించాలి. విరివిగా వర్తక సంఘములు పెట్టాలి.

ప్రభుత్వం అనుమానంతోగాకుండా అన్యోన్య మర్యాదతో వారియెడ ప్రవర్తించాలి. నిర్దిష్టమైన ఒక నైతిక పంథాలో వర్తక సంఘాలు నడుచుకోకపోతే ఆదాయం తగ్గిందిగనుక పన్ను రేట్లుకూడ పెంచుతామంటారు ప్రభుత్వం. ఒకచోట దొరకకపోయినా మరొకచోట పట్టుకోడానికే వల విస్తృతం చేసి సంపదపన్ను అనీ, వ్యయంమీద పన్ను అనీ, క్యాపిటల్ గెయిన్సు పన్ను అనీ యిప్పటికే వేస్తున్నారు.

కమ్యూనిస్టులు అందరి ఆస్తులూ లాక్కుని అందరినీ కూలీలుగాచేసి పనిచేయిస్తారన్న దుష్ప్రచారం చక్రబారుగా చాలా జరిగింది వ్యాపారంలో జూదం ఉండరాదనీ న్యాయమైన, క్రమబద్ధమైన లాభాలతో వర్తకులు సంతృప్తిపడాలనీ మాత్రమే మేము కోరతాము. ఈ సంవత్సరం ప్రభుత్వం అరాచకంగా అప్పులు బ్యాంకులద్వారా అపారంగాయిచ్చి ధాన్యంధర పెరుగుదలకు అదే కారణమైంది. దానివల్ల ఆర్థిక రంగంలో అరాచకం ఏర్పడ్డది. ధరలైనా అదుపులోపెట్టండి జీతాలైనా పెంచండి లేదా సమ్మెచేస్తామని అనేక వర్గాలవారన్నారు. మొదట్లో నిద్రపోయి మధ్యలోవచ్చి తక్కువ ధరకు నిర్బంధసేకరణ అంటూ ఒక ఆర్డినెన్సు ప్యాస్‌చేసింది కాంగ్రెస్ ప్రభుత్వం. దీనివల్ల వేలాది రైస్‌మిల్లర్లు రెండుకోట్ల రూపాయలు నష్టపోయారంటే ఆశ్చర్యంలేదు. ఇలాంటి అరాచక విధానాలను అనుసరించవద్దనే మేము కోరేది.

పరరాష్ట్రములనుండి గూడ కోటీశ్వరులను కేరళ ప్రభుత్వం ఆహ్వానించి కార్మికచట్టాల ప్రకారం వారు నడుచుకోవాలని, న్యాయమైన లాభంతో తృప్తిపడాలని, ఆ పద్ధతిలో

పారిశ్రామికశాంతిని నెలకొల్పి, పెట్టుబడులలో తోడ్పాటు, యితర సహాయాలు చేస్తామంటున్నారు. మార్కెటులో అరాచకం, మిల్లులలో అశాంతి లేకపోతే నూటికి రెండురూపాయలు లాభం తక్కువైనాసరే అదే మంచిదని గ్రహించిన పెట్టుబడిదారులు దానికి సమ్మతిస్తున్నారు. తమ లాభాలను పెట్టుబడిగామార్చి వ్యక్తులు, కంపెనీలు సాధ్యమయినంత చురుకుగా కొత్త పరిశ్రమలు పెట్టాలనే మేము కోరేది.

అమ్మకపుపన్ను బిల్లుపై అసెంబ్లీలో చర్చ జరుగుతుండగా "పి.డి.యఫ్. కమ్యూనిస్టు బ్లాక్ సోదరులంతా చాల గట్టిగా పనిచేసినా"రని ఒక ప్రముఖ వర్తక శాసనసభ్యుడు అన్నారు. కాని దుష్ప్రచారానికి లోనైన వారిలో అపోహలు త్వరగా పోకపోవచ్చు. కేవలం ఊహలమీద ఆధారపడి ఇదివరకువలె అపోహలు పడనవసరం లేదు. ఇపుడు కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వం వర్తకవర్గంపట్ల ఏ వైఖరితో వ్యవహరించుతూందో ప్రత్యక్షంగానే చూడవచ్చును.

ఉప్పాడ,
26—9—'57.

పుత్సల సత్యనారాయణ, ఎం. ఎల్. ఏ.,
పి. డి. యఫ్. కమ్యూనిస్టు బ్లాక్



19

# శ్రీ సుందరయ్యగారి ఉపన్యాసం

1957 మే 3వ తేదీన ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో ప్రతిపక్ష నాయకులు శ్రీ సుందరయ్యగారు అమ్మకం బిల్లుపై యిచ్చిన ఉపన్యాస సంగ్రహం.

అధ్యక్షా !

శాసన సభ్యులకుగాని, ప్రజలకుగాని నోటీసు యివ్వకుండా, తగిన కాలవ్యవధి లేకుండా యిట్టి ముఖ్యమైన పన్నుల బిల్లును తీసుకొనిరావడం ప్రజాతంత్రానికి, సక్రమ శాసనసభా కార్యకలాపాలకు తోడ్పడదు ... సెలక్టు కమిటీ కూడా యిచ్చిన మూడురోజుల టైములో అంతకన్న ఎక్కువ చేయలేకపోయింది. ఈ పన్ను వివిధ రాష్ట్రాలలో ఏ రీతిగా ఉన్నది ? కేంద్రప్రభుత్వం ఏమి చెయ్యబోతున్నది ? దాని వల్ల వచ్చే లాభనష్టాలు ఏమిటి ? ఎంతమంది దగ్గర వసూలు చేయాల్సివుంటుంది? దానివల్ల వచ్చేకష్టనష్టాలు—వీటన్నిటిని గురించి శాసనసభ్యులకు, ప్రజలకు సమగ్రమైన దృక్పథాన్ని ఈ వేదిక నుంచి తెలియజేయవలసిన బాధ్యత మంత్రి గారిపై ఉన్నది. వారు అట్లా చేయకుండా, ముందు శాసన

సభ్యులు విమర్శిస్తే ఆ విమర్శలకు ఏదో సమాధానం చెపుతా మని చెప్పడం న్యాయంకాదు.

సమర్థనీయంగాని పన్నుల విధానం

అసలు అమ్మకపుపన్ను బిల్లును గురించి ఆలోచించి నప్పుడు ప్రభుత్వం చెప్పే వాదన ఏమిటంటే–"మనం అభివృద్ధి కార్యక్రమాలు చాలా సాగిస్తున్నాం కనుక దానికి డబ్బు కావాలి. డబ్బుకోసం పన్ను వేయాల్సి వుంటుంది" అని చెబు తున్నారు. అమ్మకపుపన్ను ఎక్కువచేయకపూర్వం భూమిపన్ను, మోటార్ బండ్లపన్ను, వినోదపుపన్ను, స్టాంపుఫీజు ఇటువంటి వన్నీ ఇదివరకే ఎక్కువ చేశాము. రాష్ట్ర అధికారం క్రింద పన్నులు వేసేదానికి హక్కు ఉన్నవాటన్నిటినీ ఇదివరకే ఎక్కువ చేశాము. ఉన్నవాటినే మరికొంత అదనంగా చేసు కొంటే తప్ప ఆదాయం పెరగదు. ఆదాయం పెరగకుంటే ప్రజలకు కావలసిన పనులు ఏమీచేయలేము. అంతేకాకుండా కేంద్రప్రభుత్వంవారు "మీ రెవిన్యూ తరుగును ప్రతి సంవత్సరం పూడుస్తున్నాము. అభివృద్ధి కార్యక్రమాల క్రింద ఎక్కువ డబ్బు ఇచ్చి ఏమిలాభం? మీ రెవిన్యూ ఖర్చులకు కావలసిన ఆదాయాన్నైనా మీరు సంపాదించుకోవాలి. పన్నులు ఎక్కువ వేసుకోండి" అని అన్నారు. కేంద్రప్రభుత్వం యొక్క వాదనతోగాని ఈ ప్రభుత్వం పన్నులు ఎక్కువచేస్తూ ఈ బిల్లును తెచ్చిన వాదనతోగాని, నేను ఏ మాత్రం ఏకీభ వించడంలేదు. ఎందువల్లనంటే, వారు చెప్పినసూత్రాలు అన్నీ పరస్పర విరుద్ధమైనవి. ప్రజలను నిర్లక్ష్యంచేసే సూత్రాలు... ఇదివరకు అమ్మకపుపన్ను విషయంలో ప్రభుత్వానికిఆదాయం

వస్తే దానివల్ల అభివృద్ధి కార్యక్రమాలు చేసేదానికి వీలుగా ఉంటుందనే దృష్టిలో ఆలోచించే వాళ్ళము. ఇక ఆ రకంగా ఆలోచించడమంటే ప్రజలకు హానిచేయడమేనన్న అభిప్రాయానికి రాకతప్పింది కాదు... ఆంధ్ర రాష్ట్ర చట్టం సవరణ చేయకముందు 3 కోట్లు, సవరణ బిల్లు అయిన తరువాత అదనంగా మరో 2 కోట్లో 3 కోట్లో వసూలు చేస్తామని, తెలంగాణా ప్రాంతంలో ఇదివరకు 2కోట్లచిల్లర వసూలు చేసేవాళ్ళమని అంటున్నారు. ఈ పన్నులు అదనంగా వేయబట్టి మరో 2 కోట్లు అదనంగా వసూలు చేసుకోగలమని ప్రభుత్వంయొక్క అంచనా. మన రాష్ట్ర బడ్జెట్, కేంద్రప్రభుత్వం ఇచ్చే గ్రాంట్లు, అన్నీ కలుపుకొని దాదాపు 45, 50 కోట్ల రూపాయల ఆదాయం వస్తూంటే దాంట్లో దాదాపు 9, 10 కోట్ల రూపాయలు అమ్మకపుపన్ను మీదే వస్తోంది. అంచేత ఈ బిల్లు ఎంతో తేలికైనదని, పాతకాలం నాటి బిల్లులన్నీ సమగ్రం చేసిపెడుతున్నామని అనడం ఎంతమాత్రం సరైనది కాదు. ఒక విధంగా ఈ బిల్లు కొత్తపన్ను విధానమనే చెప్పాల్సి ఉంటుంది. ఈ బిల్లులో ఉన్న ప్రధాన సూత్రాలను చూచినపుడు సేల్స్‌టాక్సులో అదివరకు ఉన్న ప్రతిఒక అంశంగూడా ఎక్కువ చేయడమే జరిగింది తప్ప తగ్గించడమనేది ఎక్కడా జరగలేదు. తెలంగాణాలో ప్రతి ఒక్కదానిమీద 100 కి 50, 100 కి 100 చొప్పున పన్నులు పెంచడం జరిగింది. ఆంధ్ర ప్రాంతంలో కూడా సామాన్యంగా 100 కి 28 చొప్పున పన్నులు పెంచడం జరిగింది.

## నయాపైసా జంత్రీలో చేసిన తంత్రం

కేంద్రప్రభుత్వంవారు మారకం రేటును మార్చే టప్పుడు కానీకి రెండు నయాపైసలు, అణాకు ఆరు నయా పైసలు అని మారకపుపట్టీలో ఇచ్చారు. ఒక మనిషి ఏదైనా కొనుక్కొన్నప్పుడు గాని, అమ్ముకున్నప్పుడు గాని, లేక పన్నులు కట్టేటప్పుడుగాని అతడు మొత్తం ఎన్ని రూపాయలు కట్టవలసి ఉంటుంది? ఎంత చిల్లర కట్టవలసి ఉంటుంది? అనేది తేల్చిన తరువాత మారకపుపట్టీని అనుసరించాలని చెప్పారు. కాని కేంద్ర ప్రభుత్వం చెప్పిన మూల తత్వాన్నికూడా త్రోసిపారేసి మీాదు ప్రజలమీాద అదనపు పన్నులు వేయ డానికి దీనిని అవకాశంగా తీసికొన్నారు.

"మేము మారకపుపట్టీని బట్టి చేయడం లేదు. ప్రభు త్వానికి డబ్బు కావలసి వచ్చింది కాబట్టి అదనంగా పన్నులు వేస్తున్నాము" అని చెబితే సరిపోతుంది. కాని మారకపుపట్టీ ప్రకారమే పెడుతున్నామనీ, దానినిబట్టి ప్రజలు ఎక్కువ డబ్బు ఇచ్చుకోవలసివస్తే మేము చేయగలిగినదేమీాలేదు అనీ డొంకతిరుగుడు వాదన చేయడం ఎందుకు? మద్రాసు ప్రభుత్వంవారు అమ్మకపుపన్ను బిల్లును మొన్ననే ప్రకటిం చారు. పత్రికలలో వచ్చినదానినిబట్టి చూస్తే మామూలుగా రూపాయకు కానీ వసూలుచేసేచోట మారకపుపట్టీప్రకారం రెండు నయా పైసలు చేయలేదు. నూటికి ఎంత శాతమో లెక్కవేసి, ఇదివరకు ఎంత పన్ను ఉన్నదో చూచి, అంతే శాతం $1\frac{9}{16}\%$ మాత్రమే మేము వసూలుచేస్తామనే రీతిగా వారు బిల్లు తీసుకువచ్చారు. కాని, కానీకి రెండు నయా

పైసలు దగ్గరనే ధోరణిలో వారు హెచ్చించడానికి పూనుకో లేదు. డా॥ కతిరుగుడు వాదన వారు చేయలేదు.

నాణెములచట్టంకు విరుద్ధం కాకుండా ఇదివరకున్న పన్ను రేట్లను మేము అమలు జరపడానికి పూనుకుంటామని మద్రాసు ప్రభుత్వంవారు సవరిస్తే, ఆంధ్రప్రభుత్వం మాత్రం నాణెములచట్టంను ఆధారంగా తీసుకొని పన్నులను పెంచడానికి ఇదొకమార్గంగా చూస్తున్నారు. అంతేకాదు; తెలంగాణా ప్రాంతంలోని పన్నులను ఇదివరకు ఆంధ్రప్రాంతం లోని పన్నులస్థాయికి పెంచడమే కాక, ఇదివరకు రు. 100 కట్టేటటువంటి వారిని ఇప్పుడు రు. 128 కట్టేపరిస్థితికి తీసుకు వస్తున్నారు. తెలంగాణా విషయం చూచినపుడు చాలా దారుణంగా పన్నులను పెంచడం జరిగింది వస్తువులన్నింటి మీదా పన్నులు పెంచడం జరిగింది.

## ఇదా ఆంధ్ర - తెలంగాణాలను సమన్వయం చేసే పద్ధతి ?

ఇదివరకు గుడ్డమీద తెలంగాణాలో 4.7% ఉండేది. ఇప్పుడు 9%కు పెంచటం జరిగింది. సన్నని, అతిసన్నని గుడ్డల మీద తెలంగాణాలో అర్ధణా పెట్టడం, దానిని తరువాత కానీకి తగ్గించి, తరువాత రెండవదశలో మల్టీ పాయింట్ క్రింద ఇంకోసారి వేయడం జరుగుతోంది. దీనిమీద 3 కానులు పడితే, ఇక ముందు 1½ అణాల చొప్పున సన్నని గుడ్డమీద పెంచడం జరుగుతోంది. సన్నని, అతి సన్నని గుడ్డలు బాగా డబ్బు ఉన్నవారు కట్టుకుంటారు. వారిమీద పన్నులు ఎక్కువ పడినా ఫరవాలేదు. అట్లాగైతే మేము అంగీకరించే వాళ్లం.

కానీ మామూలు మధ్య తరగతి బట్ట (Medium cloth) మీద ఈనాడు తెలంగాణాలో అర్ధణా ఉండేదానిని అణాకు పెంచడం జరుగుతోంది. గుడ్డల విషయంలో పై విధంగా చేస్తున్నారు. ఇదివరకు తెలంగాణాలో వంటచెరకు, కట్టెలు, బెల్లం, వ్యవసాయానికి కావలసిన రసాయనిక ఎరువులు, చింతపండు, మిరపకాయలు, బంగాళా దుంపలు మొదలైన వాటిమీద పన్ను ఉండేది కాదు.

మనం వచ్చేరాకముందే, దీనినిగురించి సమగ్రమైన అభిప్రాయానికి రాకముందే, ప్రజలలో మనం కలిగించే అభిప్రాయం ఏమిటి! ఆంధ్రప్రదేశ్ రావడంతో వెంటనే పన్నులు పెరగడం జరుగుతోంది. అలాకాకుండా కొన్ని సంవత్సరాలు గడచిన తరువాత ఇచ్చుకో గలిగిన వారిమీద అధికంగా పన్నులువేసి మామూలు ప్రజలమీద అదనపు పన్నులు వేయకుండా ఉంటే ప్రజలకు సమాధానం చెప్పుకోడానికి బాగుండును. ఆంధ్ర ప్రదేశ్ వచ్చిన తరువాత మీకు ఏమిలాభం జరిగిందయ్యా అన్నట్లయితే, రోజూ వుపయోగించే వస్తువులమీద రెండు రెట్లు పన్నులు అదనం అయ్యాయనే రీతిగా ఉన్నది. మామూలు ముతక గుడ్డలమీద, మధ్యతరగతి గుడ్డలమీద రెండురెట్లు పన్ను అధికం చేశామని స్పష్టంగా వెల్లడించడానికి ఈ బిల్లు పనికివస్తుంది తప్ప మరొకటి కాదు.

మంత్రి గోపాలరెడ్డిగారు : ఆంధ్రలో వేయవచ్చుననీ, తెలంగాణాలోమాత్రం వేయకూడదనా గౌరవసభ్యుని ఉద్దేశం? అక్కడ ఒకరకంగా ఉండాలనీ, ఇక్కడ ఒకరకంగా

ఉండాలనేనా వారిభావం? ఇవన్నీ ఆంధ్రదేశంలో ఉన్నాయి కాబట్టి ఈనాడు తెలంగాణాలోకూడా వస్తున్నాయి.

శ్రీ పి. సుందరయ్య: అక్కడవేసు ఇక్కడవేసు కానక్కరలేదు. ఆంధ్రలో ఉన్నాయికాబట్టి తెలంగాణాలో వేస్తున్నామని మంత్రిగారు చెబుతున్నారు. నా ఉద్దేశం అక్కడకూడా తగ్గించాలనే. ఇంత చిన్నవిషయంలో గోపాల రెడ్డిగారికి ఎందుకు సందేహం వచ్చిందో నాకు అర్థంకావడం లేదు. ప్రజలుపయోగించే వస్తువులమీద పన్నులు తక్కువగా ఉండాలని మా ఉద్దేశం. ప్రజలంటే బీదప్రజలనే నా ఉద్దేశం. బీదప్రజలు, మధ్యతరగతి ప్రజలు తప్ప ధనవంతులను ప్రజలుగా చెప్పడానికి వీలులేదు. ధనవంతులకు ధనవంతులనే పేరుతప్ప సామాన్యప్రజలనే పేరును ఉపయోగించడం సరి అయినది కాదనే నా అభిప్రాయం; వారు 4, 5 శాతముకన్న ఎక్కువ ఉండరు. ప్రజలు అనే పదంలో ధనవంతులను కలుపకుండాచేస్తే అన్నీ సక్రమంగా ఉంటాయని నా అభిప్రాయం. 9 కోట్ల రూపాయలను పన్నుగా వసూలుచేసే ఈ బిల్లును గురించి లోతుగా, సాకల్యంగా చర్చించకపోతే మన కర్తవ్యాన్ని నిర్వర్తించినట్లుకాదు.

ఈ శాసనసభలో దాదాపు 215 మంది కాంగ్రెసు సభ్యులున్నారు. అన్ని సందర్భాలలోను వారిని బలపరచే వారు ఇంకా 30, 40 మంది ఉన్నారు. 300 మంది వరకు ఉండే ఈ సభలో 250 మందివరకు బలం ఉన్నపుడు మెజారిటీ విషయంలో ఎవరికీ ఎట్టి సందేహంలేదు. వారికి ఇష్టంవచ్చిన బిల్లును ఇష్టంవచ్చిన రీతిగా శాసనం చేయవచ్చు. కాని

పెద్ద మెజారిటీతో పరిపాలన చేస్తున్నామనికాక సామాన్య ప్రజల కష్టాలను కొంతవరకయినా ఆలోచించగలిగే స్థితిలో ఉండాలి. ఆంధ్ర-తెలంగాణా రెండు ప్రాంతాలను సమన్వయంచేయాలి; ఒకే అభిప్రాయానికి తీసుకురావాలి; శతాబ్దాలుగా వేరు వేరుగా ఉన్నందువల్ల వచ్చిన విభిన్న ధోరణులను పోగొట్టాలి; దానికి కొంతకాలం పడుతుంది. ఆంధ్రప్రదేశ్ వచ్చీరాకముందే తెచ్చిన మొదటి బిల్లు ఏమంటే సామాన్య ప్రజలుపయోగించే మామూలు వస్తువుల మీాద రెట్టింపు పన్ను విధించే బిల్లు. ఒక ప్రక్క అనుమానాలు పోగొట్టాలని, దానికి కాలం పడుతుందని కాంగ్రెసు ప్రభుత్వమే చెబుతోంది. మరొకవైపు దానికి ప్రత్యక్ష విరుద్ధంగా, దానికై కాలం తీసుకోకుండా, ప్రజలను దానికి తయారు చేయకుండా, సామాన్య ప్రజలకు నష్టకరమైనరీతిగా పన్నులను పెంచేపద్ధతి ననుసరిస్తున్నారు. ఇది ఏమాత్రం సవ్యమైనది కాదు. అభివృద్ధి కార్యక్రమాలకై పన్నులు వేసేటప్పుడు సేల్సుటాక్సు ఒకటే తప్ప మరొక మార్గంలేదా?

## కేంద్ర పన్నుల విధానం

మన రాష్ట్రంలో అదనంగా పన్నులు వేసుకోవలసిన అవసరం ఉన్నదా అని నాకు అనుమానం ఉన్నది. మన రాష్ట్రంలో ఎన్ని పన్నులు వేసుకున్నా ఆదాయంలోని లోటును (Revenue deficit) భర్తీ చేసుకొనగలమా? ప్రజల కార్యక్రమాన్ని ముందుకు తీసుకుపోగలమా? అనిపిస్తోంది. కేంద్ర ప్రభుత్వం అనుసరించే పన్నుల విధానం

చూస్తే రాష్ట్రాల స్వపరిపాలన అనేది కేవలం బూటకం అయిపోయింది; జిల్లాబోర్డులకన్న కనిష్టమైన స్థితిలోనికి రాష్ట్రాలు వచ్చాయి. రాజ్యాంగ చట్టం ప్రకారం బాగా ఆదాయంవచ్చే పన్నులన్నీ కేంద్రప్రభుత్వం చేతులలోనికి పోయినాయి, ఉత్పత్తిమీద పన్నులు (Excise taxes), ఎగుమతి దిగుమతి సుంకాలు ఆదాయంమీద పన్నులు— ఈ విధంగా ఆదాయం బాగావచ్చే పన్నులు, ఇచ్చుకోగలిగిన ధనవంతులమీద వేసేపన్నులు అన్నింటినీ కేంద్ర ప్రభుత్వం తన చేతులలో పెట్టుకున్నది. రాష్ట్ర ప్రభుత్వాలకు ఇచ్చినది ఏమంటే, అమ్మకంపన్ను, భూమిపన్ను, వినోదాలు, కాలక్షేపాలు, సినిమాలు మొదలైన వాటిమీద పన్ను; కల్లుమీద పన్ను; పొగాకుమీదపన్ను – ఇటువంటి సామాన్య ప్రజలు వుపయోగించే వస్తువులమీద పన్నులు మాత్రం రాష్ట్రాలకు ఇచ్చారు. శ్రీ గోపాలరెడ్డిగారు, అంతకుముందు శ్రీ రాజగోపాలాచారిగారుకూడా అమ్మకం పన్నును కామధేనువు అన్నారు. తెగపిండుతుంటే ఆ కామధేనువే కరువుదేవత క్రింద తయారైనా ఆశ్చర్యంలేదు. రాజ్యాంగమే ఆ విధంగా తయారుచేశారు. అంతటితో ఆగలేదు.

## అంతర్రాష్ట్ర అమ్మకపుపన్ను చట్టంవల్లకలిగే నష్టం

రాష్ట్ర ప్రభుత్వాలకు ఇచ్చిన ఆ కొద్దిపాటి పన్నుల విషయంలోకూడా క్రమేణా ఒక చట్టం తరువాత మరొక చట్టం తెచ్చి అధికారాలు ఊడగొట్టి కేంద్రప్రభుత్వం తానే తీసుకొంటోంది. ఉదాహరణకు అమ్మకం పన్ను విషయమే తీసుకుందాం. ఒక రాష్ట్రంలో అమ్మినసరుకును మరొక రాష్ట్రంలో

కొనుక్కుంటే భారతదేశం అంతా ఒకటే దేశం కాబట్టి, రాష్ట్రాలమధ్య వ్యాపారం జరిగే వస్తువులపై రాష్ట్రం పన్ను వసూలుచేస్తే తప్పు అవుతుంది అనే అర్థంచెప్పి, అటువంటి అమ్మకాలపై పన్ను వసూలు చేయడం నిషేధిస్తూ సుప్రీం కోర్టు తీర్పు చెప్పినది. అటువంటి సందర్భాలలో ఏ పన్నూ చెల్లించకుండా పోతారనే అభిప్రాయంతో కేంద్ర ప్రభుత్వం అంతర్ రాష్ట్ర అమ్మకం పన్నుకు సంబంధించి ఒక చట్టాన్ని తీసుకువచ్చింది. వివిధ రాష్ట్రాలమధ్య వర్తక వ్యాపారాలకు పనికివచ్చే వస్తువులలో ముఖ్యమైన వాటిని ఇష్టం వచ్చినప్పుడు ప్రకటితవస్తువులు కేంద్రప్రభుత్వం ప్రకటిస్తే వాటిని (Declared goods) చేస్తే - వాటి మీద 2% అంటే రెండు నయాపైసలకన్న ఎక్కువ పన్ను వేయటానికి వీలులేదని చట్టం తెచ్చినది. దీని అర్థం ఏమిటి? అంతర్ రాష్ట్ర అమ్మకం పన్ను అనే పేరుతో రాష్ట్రాలకు అమ్మకంపన్ను విషయమైఉన్న అధికారాలను పరిమితం చేశారన్నమాట. ఒకరాష్ట్రంలో అమ్మినసరుకు మరొకరాష్ట్రంలో కొనుక్కున్న సందర్భంలో ఆ వస్తువులపై పన్ను వసూలు చేయరాదని సుప్రీంకోర్టు తీర్పుఇస్తే, రాజ్యాంగాన్ని సవరించి పన్నులను వసూలుచేసే విషయంలో రాష్ట్రాలకుగల హక్కులను, అధికారాలను కాపాడటానికి బదులు ఆ తీర్పును అవకాశంగా తీసుకొని రాష్ట్రాలకు ఉన్న అధికారాలను కేంద్రప్రభుత్వమే తీసుకున్నది. తీసుకొని రాష్ట్రాలకు ఆదాయంవచ్చే వస్తువుల జాబితానుంచి తీసివేసింది. అట్లా రాష్ట్ర జాబితాలోనుంచి తీసివేసిన వస్తువులు పొగాకు,

ఉక్కు, ఇనుము, నూనెగింజలు, జనపనార, దూది, తోళ్ళ పరిశ్రమలు. వీటన్నిటినికూడా కేంద్రప్రభుత్వం తీసుకొని వీటి మీద 2% కు మించి ఏ రాష్ట్ర ప్రభుత్వంకూడా పన్ను వేయడానికి వీలు లేదన్నారు. ఎగుమతుల, దిగుమతుల పేరుతో ఎగుమతి చేయడానికి పనికివచ్చే ఏ వస్తువుమీదకూడా పన్ను వేయకూడదని చట్టంచేసినది. అంతేకాకుండా యీరోజు గుడ్డలమీద, చక్కెరమీద, పొగాకుమీద కేంద్రమే "కొన్ని ఉత్పత్తి (Excise) పన్నులు వేసి, ఆ పన్నును రాష్ట్రాలకు దామాషామీద పంచిపెడతాం" అంటూ ఆ వస్తువులపై అమ్మకంపన్నును రాష్ట్రాలు వేసే అధికారాలను తీసివేసినారు. Motor Vehicles Centralization Act ను తయారుచేసి వాటిమీదకూడా రాష్ట్రాలకు ఎక్కువ పన్ను వేసే అధికారం లేకుండా, కేంద్ర ప్రభుత్వమే ఆ అధికారాన్ని తీసుకున్నది.

## విలాసవస్తువుల పట్ల విధానం

ఇక విలాసవస్తువుల మీద అదనంగా పన్ను వేసుకోవచ్చు. విలాసవస్తువుల జాబితాలో 17 వస్తువులను ఒకటవ షెడ్యూలులో యిచ్చారు. వీటిని గురించి మామూలు పన్నుకంటె 5%, 3% చొప్పున అదనంగా సింగిల్ పాయింట్ పన్ను వేయవచ్చునని షెడ్యూలులో ఉన్నది. అంతకన్న ఎక్కువ వేయటానికి వీలున్నదా అంటే, అది సాధ్యంకాదు. ఏమంటే ఒక రాష్ట్రంలో విలాసవస్తువులమీద అనగా బంగారం, మోటారుకార్లు, గ్రామఫోన్లు, రేడియోలవంటి వస్తువులపై అదనంగా పన్నులు వేస్తే, రెండో రాష్ట్రంలో అదనంగా వేయకపోతే వాటిని కొనే ప్రజలు దగ్గరనున్న మద్రాసుకో కల

కత్తాకో వెళ్లి కొనుక్కునివస్తారు. వాళ్లు డబ్బున్నవాళ్లు కనక రైలు ప్రయాణపుఖర్చు సమస్యకాదు. ఇక్కడ పన్నుకట్టుకునేదానికన్న చౌకగా ప్రక్క రాష్ట్రంలో కొంటారు. కనుక ఏఒక్క రాష్ట్రంలోనో విలాసవస్తువులమీద పన్ను వేయడంవల్ల యిప్పుడు వచ్చే ఆదాయంకూడా పోతుంది. కాబట్టి నష్టంతప్ప యింకోటిలేదని ఏ రాష్ట్రాని కా రాష్ట్రం యీ విలాస వస్తువులమీద పన్ను తగ్గించ డానికి పూనుకుంటుంది. ఇది అమ్మకపు పన్ను విచారణ కమిటీ ముందు వచ్చిన సమస్య. ప్రతి రాష్ట్ర ప్రభుత్వం ముందుకు వచ్చిన సమస్య యిదే. కాని నేను అడిగే దేమంటే కేంద్ర ప్రభుత్వానికి నిజంగా డబ్బు కావాలంటే ప్రజ లుపయో గించే వస్తువులపై ఏ రాష్ట్రం కూడా ఎక్కువ పన్ను వసూలు చేయకూడదని చెప్పకుండా, విలాసవస్తువులపై పన్ను వేసే అధికారం కేంద్ర ప్రభుత్వమే తీసుకొని, యింత కన్నా అదనంగా ఉత్పత్తి పన్ను వేసి, ఆ వచ్చిన పన్నును అన్ని రాష్ట్రాలకు దామాషాను పంచిపెట్టడానికి ఎందుకు పూనుకోకూడదు? ఆదాయం ఎక్కువ వచ్చే ఉక్కు, పొగాకు, జనపనార, దూదిమీద 2% కంటె ఎక్కువ పన్ను వేయగూడదని శాసించడం, విలాస వస్తువులను కేంద్ర ప్రభుత్వం అసలు తీసుకోకపోవడం, తీసుకున్నవి గూడా ప్రజల కుపయోగించే చక్కెర, గుడ్డలను కేంద్ర ప్రభుత్వం తీసుకోవడం చూసినట్టయితే ఏమనుకోవాలి? ధన వంతులపై పన్ను వేయడానికి కేంద్రప్రభుత్వాని కిష్టంలేదు. రాష్ట్ర ప్రభుత్వాలకు ధనవంతులపై పన్నులు వేయడానికి

అవకాశం లేకుండా చూడాలి. సాధారణంగా విలాసవస్తువుల మీాద పన్ను వేయడానికి వీలులేదు. కాబట్టి వాటిమీాద ఎక్కువపన్ను వేయడానికి ఎటువంటి శ్రద్ధా తీసుకోవడం లేదు. ఇక రాష్ట్ర ప్రభుత్వాలకు మిగిల్చింది ఏమిటంటే చింతపండు, మిరపకాయలు - శ్రీ గోపాలరెడ్డిగారి కిష్టమైన ఉల్లిపాయలు - యిటువంటి వస్తువులు. అందుచేత రాష్ట్ర ప్రభుత్వాలలో యిటువంటి పన్నుల నెక్కువచేసే బిల్లులు వచ్చినప్పుడు ప్రజా ప్రతినిధుల కర్తవ్యం ఏమిటంటే, కాంగ్రెసు ప్రభుత్వం ఎన్ని సాకులు చెప్పినా, అభివృద్ధికోసం పన్నులు వేయాలని కారణం చెబితే అది బూటకపు కారణ మనీ పన్నులు వేయాల్సినవారిమీాద కేంద్రప్రభుత్వమూ, రాష్ట్రప్రభుత్వాలు పన్నులు వేయడంలేదని, బీదలపైన వేసే యీా పన్నులవిధానానికి పూర్తిగా వ్యతిరేకులమని చెప్పడమే ప్రజా ప్రతినిధుల కర్తవ్యం. ధనవంతులపైన పన్నులువేసి, వసూలుచేసి, సక్రమంగా ఖర్చుపెడుతూంటే యింకా డబ్బు కావాలంటే అప్పుడు తిన తిండిలేక కటకటలాడే ప్రజలను పన్నులను భరించమంటే అర్థం వున్నది. వ్యతిరేకతను గమ నించకుండా, మెజారిటీ వుందని పన్నులు వేసుకుంటూపోతే ఆ తరువాత ప్రజలు ఆలోచించుకోవలసివుంటుంది.

## ఆదాయాభివృద్ధికి అవకాశాలు లేకపోలేదు

రాష్ట్రాలే భూమి పన్ను వేయాలని వుంది. కాని రాష్ట్ర ప్రభుత్వాలకు ఎక్కువ ఆదాయం వచ్చేవిధంగా వ్యవ సాయపు టాదాయంపై పన్నువేయడానికి ప్రభుత్వం తయారవుతుందా? తెలంగాణాలో వున్నది కనుక ఆంధ్రలో వేద్దా

మంటే పదిలక్షల రూపాయలైనా ఆదాయం రాదు. కనుక పన్నువల్ల లాభంలేదని ప్రభుత్వం అనేసింది. వంద ఎకరా లున్న భూస్వాములు తమ భార్యలపేర, మిత్రులపేర దస్తా వేజులు వ్రాసి తమపేర పది ఎకరాలకంటె ఎక్కువలేదని రికార్డులు తయారుచేసుకుంటే అలాంటి రికార్డులతోనే భూమి లెక్కలు తీసి ఆంధ్రదేశంలో ఎక్కువ ఆదాయం వచ్చే భూస్వాములులేరనీ, అందువల్ల దానిపై విధించే పన్నువల్ల ఆదాయం రాదనీ అంటున్నారు. ఈ రకంగా పన్నుఎగవేసేటటు వంటి పెద్దభూస్వాములకు తోడ్పడకుండా ఖచ్చితమైన లెక్కలు తీసి పన్ను వేయాలి. అలా చేయకుండా, తేలికగా నోరులేని ప్రజలపై అమ్మకపుపన్ను వేస్తున్నారు. ఉత్పత్తి పన్నులను ఎక్కువ చేసి స్లాబ్ రేట్‌ను పెంచి కేంద్ర ప్రభుత్వం వసూలు జేసి రాష్ట్రాలకు పంచుతున్నట్లే మామూలు ఇన్‌కంటాక్సుతో వ్యవసాయాదాయపు పన్నును జతచేసి స్లాబ్ రేట్‌ను పెంచి, వచ్చినఆదాయం రాష్ట్రప్రభుత్వాలకు కేటాయించా లని మన రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వాన్ని ఎందుకు అడగ కూడదు ? ఆ రీతిగా చేయకుండా కాస్తో కూస్తో వచ్చే ఆదా యాన్ని కేంద్రప్రభుత్వం వదలకుండా పేద ప్రజానీకంమీద పన్ను వేయదలచే యీ పన్నుబిల్లుకు విలువవున్నదా ? దానికి 'ఊ' కొట్టి అంగీకారం తెలియజేయడం మావల్ల కాదు. ప్రజలముందుకుపోయి అభివృద్ధికి మార్గమీ పన్ను లేనని చెప్ప డానికి తయారుగా లేము. ఏదైనా పరిశ్రమపెట్టుకొని ఆదాయం పెంచుకొందామనిచూస్తే పబ్లిక్‌రంగం, ప్రైవేటురంగం వుంది. రాష్ట్ర ప్రభుత్వములు సిమెంటుఫ్యాక్టరీ పెట్టుకోకూడదు.

చక్కెర ఫ్యాక్టరీ పెట్టుకోకూడదు. ఎందుకంటే లాభాలురావు. ప్రజలలో ఎక్కువ ఖర్చు అయ్యేవస్తువులు ప్రభుత్వం తయారు చేస్తే లాభాలు రావు. అవే వ్యక్తిగతంగా పెట్టుబడిదార్లు పెట్టుకుంటే వారికి లాభాలు వస్తాయి. అందుచేత వాళ్ళనే పెట్టుకోనివ్వండి. లాభాలు వారినే తీసికోనివ్వండి— ఇదీ ప్రభుత్వ విధానం.

రాష్ట్రాలు కేంద్రంతో ఒక్కమాట చెప్పవచ్చు. "అన్ని పన్నులు మీరే వసూలుచేసి జనాభానుబట్టి మా దామాషా మాకు పడేయండి. అభివృద్ధి చెందిన రాష్ట్రాలలో వలె విద్యా సౌకర్యము, వైద్య సౌకర్యము, పరిశ్రమల అభివృద్ధి, ఉద్యోగ అవకాశములు కలుగజేయండి. కేవలం దామాషాకోసమేకాదు. వెనుకబడిన రాష్ట్రాలను ముందు వున్న రాష్ట్రాలతోపాటు తీసుకువచ్చేదానికి కొంచెం అదనపు డబ్బు ఇవ్వవలసి వుంటుంది." ఇలా చెబితే ఈ పన్నుల బాధ వుండదు. ఆ రీతిగా కేంద్ర ప్రభుత్వంవారి వద్దనుండి హెచ్చు డబ్బు తెచ్చుకొంటే ఎవ్వరూకూడా యీ ప్రభుత్వాన్ని నిందించవలసిన అవసరం వుండదు. ఉద్యోగస్థులకుకూడా కేంద్ర ప్రభుత్వపుజీతాలు వస్తాయి. మనం ముందుకుపోవడానికి వీలు వుంటుంది. ఆదాయం రాని పన్నులను రాష్ట్రప్రభుత్వాలు వుంచుకొని రాష్ట్రాన్ని ముందుకు తీసుకపోతామనిచెప్పడంలో అర్థంలేదు. కనీసం రాష్ట్ర ప్రభుత్వం యీ తిట్లు తినకుండా కేంద్ర ప్రభుత్వం తినడమే మంచిది. ఈ విషయం రాష్ట్ర ప్రభుత్వం యోచించవలసినదని కోరుతున్నాను.

## కనీస అమ్మకం, మొత్తం అమ్మకం, నికర అమ్మకం

ఇక కనీస అమ్మకం గురించి మనవిచేస్తాను. 'గుడ్డిలో మెల్ల' అన్నట్లు – ప్రభుత్వంవారు అవలంబిస్తున్న విధానం మాకు ఎంత అసంతృప్తికరంగా వున్నప్పటికీ – చేతనైనంత సహాయం ప్రజలకు చేద్దామనే సంకల్పంతో సెలెక్టు కమిటీలో వుండుటకు మేము అంగీకరించాము. ఎంక్వాయిరీ కమిటీలో ప్రతిపక్షంనుంచి ఒకరినిమాత్రమే నియమించినప్పటికీ ఏదోవిధంగా ప్రభుత్వానికి నచ్చజెప్పి పేద ప్రజలకు కొంత సహాయం చేద్దామనే దృఢ సంకల్పంతో అందులోకూడా పాల్గొన్నాం.

కాని ఈ సంకల్పంతో చేయబడిన మా సూచనలన్నీ నిరాకరింపబడ్డాయి. ఈ బిల్లును చర్చిస్తున్న సందర్భంలో సేల్సుటాక్సుయొక్క చరిత్రనుకూడా మరొకపర్యాయం సభ్యులకు జ్ఞాపకం చేయవలసియున్నది. 1937–'39 సం. లలో సేల్సు టాక్సు ఆరంభింపబడినపుడు ప్రజలయొక్క ఆరోగ్యాన్ని, నైతిక ప్రవర్తనను బాగుచేయడానికి మద్యపాన నిషేధాన్ని అమలుపరుస్తున్నామని, ఆ విధంగా కలిగే లోటును భర్తీ చేయడానికి సేల్సుటాక్సును విధిస్తున్నామని ఆనాటి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారిగారు చెప్పి వున్నారు. మద్యపాన నిషేధం వచ్చింది. ఐతే దానివల్ల లాభాలున్నాయా, లేవా అనే విషయం వేరు. దాని జయాపజయాల విషయంలో మాకెన్నో సందేహాలున్నాయి. దొంగ సారాయి ఉత్పత్తి విశేషంగా జరుగుతూందనేది అందరికీ తెలిసిన విషయమే. ఇది జరిగితేగాని కొంతమంది ఉద్యో

గస్థులకు గాని, కొంతమంది ధనవంతులకు గాని, మరికొంత మంది యితరులకుగాని వృత్తులు పోతాయని ప్రభుత్వం భావించవచ్చు. మద్యపాన నిషేధమైనా రాష్ట్రమంతటిలో ఒకేవిధంగా లేదు. తెలంగాణా ప్రాంతంలో యీ నిషేధం లేదు. ఐతే వెనుక ఎగుమతి దిగుమతి సుంకాలు హైద్రాబాదు రాష్ట్రంలో వుండేవనీ, వాటిస్థానే యిపుడు సేల్సుటాక్సు విధింపబడుతున్నదనీ చెప్పవచ్చు. రాష్ట్ర ఐక్యత దృష్ట్యా మద్యపాన నిషేధం విషయంలో ఒక లాభదాయకమైన విధానం వుండడం మంచిది. అభివృద్ధి కార్యక్రమాలకు డబ్బు కావాలనే సాకుతో పేద ప్రజలమీద పన్నులు రుద్దడం జరుగుతున్నది. ఐతే, ఏ సూత్రాల ననుసరించి పన్నులు విధింపబడాలి అనే విషయాన్ని ప్రభుత్వం గమనించాలి. సాధ్యమైనంత తక్కువమందిమీద తేలికగా వసూలయ్యే రీతిలో పన్నులు విధించడం ఉత్తమం. ఇచ్చుకోగలవారి పైననే పన్నులు విధించాలి. పేదప్రజల జీవనప్రమాణాలను గమనించి వారిపై పన్నుల భారం తగ్గించాలి. వివిధ వర్గాల జీవన స్థితిగతుల దామాషానుబట్టి పన్నులు విధించాలి. అయితే యీ సూత్రాలలో వేటినికూడా ప్రభుత్వం సేల్సుటాక్సు విధింపు విషయంలో అమలుజరుపుటలేదు. పేదలమీద పన్నులభారం పడుతున్నదని మంత్రులు అంగీకరించారు. వర్తకులు అంగీకరించారు. దేశమంతా అంగీకరించినది.

మద్రాసు రాష్ట్రంలో సాలుకు 10 వేల రూపాయల అమ్మకంగల వర్తకుల దగ్గరనుంచి మాత్రమే యీ పన్ను వసూలు చేస్తున్నారు. అంతకు తక్కువ వర్తకం చేసే

వాళ్ళమీద యీ పన్ను విధించరు. సంవత్సరానికి 10 వేల రూపాయల అమ్మకం అంటే నెలకు దాదాపు 8 వందల రూపాయల వ్యాపారం. అంటే రోజుకు సుమారు 25, 30 రూపాయలకు బేరం ఉంటుంది. రోజుకు 2 రూపాయలకు మించి అతడు లాభం సంపాదించలేడు. అతని వర్తకం ఎంత పెద్దదో మనం అర్థం చేసుకోవచ్చు. అటువంటి చిన్న వర్తకు లను లెక్కలుకట్టమని ప్రభుత్వం ఒత్తిడిచేయడమంటే, వారిని ఇబ్బందులపాలు చేయడమే. ఇట్టి చిన్న వ్యాపారస్థులపై ఉద్యోగస్థులు పెత్తనంచేయడానికి యీ బిల్లుద్వారా సదు పాయం కల్గించడం మాత్రమే అవుతుందిగాని, దానివలన వచ్చేలాభం అంతంతమాత్రంగానే ఉంటుంది. ఈ చిన్న వర్తకులను విసిగించి, అపహాస్యంపాలుచేసి, ప్రజలు అస హ్యించుకొనేరీతిగా ఈ పన్నులు తయారుచేయవద్దని ప్రభుత్వం వారికి తెలియజేస్తున్నాను. ఆంధ్రరాష్ట్రంలో 10 వేల రూపా యలను ఒక పరిమితిగా పెట్టడం జరిగింది. కాని ఇప్పుడు దానిని *7,500 రూపాయలకు దించడం జరిగింది. ఏడాదికి 7 500 రూపాయలు టర్నోవరు వున్నవారు యికముందు పన్ను కట్టుకోవాలి.

మొట్టమొదట సేల్సుటాక్సు విధింపబడినపుడు 10,000 రూపాయలు నికర అమ్మకం వున్నపుడు దానిపై పన్ను విధించవచ్చునని చెప్పబడియున్నది. అంటే పన్ను చెల్లించ వలసిన వస్తువులను మాత్రమే 10,000 రూపాయల వరకు అమ్మితే, ఆ వర్తకుడు ప్రభుత్వానికి పన్ను చెల్లించవలసి

* ఇది చివరకు రు. 10,000 కు పెంచడం జరిగింది.

యుంటుంది. అటువంటి వర్తకులు మాత్రమే పన్ను చెల్లించ వలెనని మద్రాసు జనరల్ సేల్సుటాక్సు ఆక్టులో వున్నది. ఐతే, యీ నిబంధన 1939 సంవత్సరములో చేయబడింది. కాని 1956 సంవత్సరములో యీ చట్టానికి అప్పటి ఆంధ్ర ప్రభుత్వం ఒక సవరణ చేసింది. దానినిబట్టి "గ్రాస్‌టర్నోవర్" 10,000 రూపాయలు వున్నట్లైతే అమ్మకపు పన్ను చెల్లించా లన్నారు. అంటే అమ్మకం పన్నునుంచి కొన్ని వస్తువులు మినహాయించబడినప్పటికీ వాటి అమ్మకాన్నిగూడా కలుపు కొని సాలుసరి విక్రయం 10,000 రూపాయలు వున్నట్లయితే ఆ వర్తకుడు పన్ను విధింపు నిబంధనకు లోబడవలసి వస్తుంది. అమ్మకంపన్నునుంచి మినహాయించిన వస్తువులను అమ్ముతున్న వర్తకుడు పన్ను చెల్లించాలనే వాదన సమంజసమైనదికాదు. ఏ వస్తువులమీద పన్ను లేదని చెప్పారో ఆ వస్తువులను అమ్ముకొన్నప్పటికికూడా వాటి అమ్మకాన్ని లెక్కలోకి తీసికొని పన్ను విధించదలచడం అన్యాయం.

అంతేగాక అమ్మకం 5000 రూపాయలకు మించిన వర్తకులందరూ రిజిష్టరు చేసుకోవాలనే నిబంధన యున్నది. మొట్టమొదట సేల్సుటాక్సు చట్టం ఆనాడే 10,000 రూపా యల వర్తకం చేసుకొనేవారికే వర్తింపచేయవలెనని శ్రీ రాజగోపాలాచారిగారు ఉద్దేశిస్తే, విపరీతంగా ధరలు పెరిగిన యీనాడు 7,500 రూపాయలకు తగ్గించేరు. అంటే నానా టికీ ఇంకా ఇంకా చిన్నవర్తకులను ఈ చట్టంతో కట్టివేస్తు న్నారు. ఈ పన్ను వసూలుకు ప్రభుత్వంవారు నిక్కచ్చిగా తమ పోలీసులను, యితర పరిపాలనా యంత్రాన్ని మరింత

కఠినంగా ఉపయోగిస్తారు. ఇందుకే ప్రభుత్వం యీ బిల్లు ద్వారా ఎక్కువ అధికారాలను తీసుకొంటున్నది.

తనది 7,500 రూపాయలకంటె ఎక్కువ లేదని ఋజువు చేసుకొంటే దానికి మినహాయింపు ఉంటుంది. అలా ఋజువుచేసుకోలేని పరిస్థితులు ఉన్నట్లయితే అప్పుడు ఏ వుద్యోగో, ఏ సేల్స్ టాక్స్ ఆఫీసరో వెళ్ళి "మీకు ఇంత అమ్మకం జరుగుతూందని" ఇష్టంవచ్చినట్లు పన్ను వసూలు చేయవచ్చును. అసలు 1937 లో 10 వేల రూపాయలు నికర అమ్మకం వున్నట్లయితే పన్ను ఉండేది. ఈరోజు రూపాయి ఆరోజు నాలుగు అణాలతో సమానం. ఆరోజు రు. 10 వేలు అమ్మినవాళ్ళమీద పన్ను వేయడం న్యాయం అయితే నేడు రు. 40,000 అమ్మిన వాళ్ళమీద పన్ను వేయాలిగాని, అంతకంటె తక్కువ ఉన్నవాళ్లమీద వేయడం సూత్రప్రకారం తప్పు. ఈరోజు ఉన్న మినహాయింపుల జాబితానుబట్టి చూస్తే మొత్తం గ్రాస్ టర్నోవరు 50,000 ఉంటే నికరఅమ్మకం పదివేలుకన్నా ఎక్కువ ఉండదు. అంటే పన్ను కట్టుకోవలసిన వస్తువులు చూచినట్లతే, సగం కంటె ఎక్కువ ఉండవు. అటువంటప్పుడు అమ్మకానికి కనిష్ఠ పరిమితి పెంచడానికిబదులు తగ్గించడమంటే చిన్నచిన్న వర్తకులు, కిల్లీ దుకాణదారులు మొదలైనవారి వద్దకు ప్రభుత్వము తన ఉద్యోగి బృందాన్నంతా పంపించి బలవంతంగా పన్నులు వసూలు చేయడం తప్పితే ఇంకొకటికాదని స్పష్టంగా తెలుసుకోవచ్చు.

అధ్యక్షులు : త్వరగా పూర్తిచెయ్యండి.

(శ్రీ) పి. సుందరయ్య : ఇది చాలా ముఖ్యమైనబిల్లు. తొమ్మిదికోట్ల రూపాయలకు సంబధించినది. అందుచేత కనీసం 9 రోజులైనా పడుతుంది.

అధ్యక్షులు : మీకు ఎంతటైము కావాలి ?

(శ్రీ) పి. సుందరయ్య : కనీసం 2, 3 గంటలైనా కావాలి.

అధ్యక్షులు : మంత్రులకు, లీడర్సుకు అరగంటసేపు అని కాలపరిమితి పెట్టుకొన్నారు. పోనీ మీరు ఇంకొక అరగంట సేపు తీసుకోండి.

(శ్రీ) పి. సుందరయ్య : మామూలుగా ఏ బిల్లు వచ్చినప్పటికినీ, సభ్యులంతాకూడా సాకల్యంగా చర్చించడం జరుగుతుంది. మేము చెప్పిన విషయాలే చెప్తూఉంటే, మీరు టైం ఇవ్వకపోవడంలో అర్థం ఉన్నదిగాని, చెప్పిన అంశం చెప్పకుండా మాట్లాడుతున్నపుడు కావలసిన టైం ఇవ్వకపోవడం సరిగాదు. పోనీ, ఈ బిల్లుకు సంబంధంలేని విషయాలు, వివాహాలు గురించిగాని, విడాకుల చట్టాలను గురించిగాని మాట్లాడుతూ ఉంటే "అసందర్భంగా ఉన్నది. శాసనసభయొక్క కాలాన్ని దుర్వినియోగం చేస్తున్నారు" అని చెప్పవచ్చు. కాని, ఈ బిల్లుకు సంబంధించిన సూత్రాలపై మాట్లాడుతున్నపుడు, "అరగంటలో పూర్తిచేయాలి. పది నిమిషాలలో పూర్తిచేయా" లన్నట్లైతే ఈ చర్చలవల్ల ఏమీ ప్రయోజనముండదు. ఇదివరకు పార్లమెంటులోగాని, ఏ శాసనసభలోగాని బిల్లులకు సంబంధించిన సూత్రాలు

గురించిగాని, అందులో వివిధ హంశాలుగురించిగాని మాట్లాడి నప్పుడు దానికి కాలపరిమితి పెట్టడం అనేది నాకు తెలిసి నంతవరకు ఎక్కడా లేదు. శ్రీ గోపాలరెడ్డిగారు 1936 నుంచి శాసనసభలో ఉన్నారుగదా! వారిని చెప్పమనండి. ఆ విధంగా చెప్పితే—సరియైనది కాకపోయినప్పటికి మీ సూచన అంగీకరించడానికి తయారుగా ఉన్నాను.

ఇకను నికర అమ్మకపులెక్క వదిలేసి మొత్తం అమ్మకపు లెక్క తీసుకోవడం సరికాదు. ఇదివరకు పదివేలు ఉన్న దాన్ని పెంచవలసినదానికి బదులు ఏడువేలకు దించడంఅంటే ఇది చిన్న చిన్న వర్తకులను పీడించే దానికే తోడ్పడుతుంది. దీనివలన ఈ పన్నుల సిబ్బందికి మరొక అవకాశం కలుగజేసి మన ప్రజలలో అసహ్యత, అయిష్టత పుట్టి ఈ పన్నులను తప్పించుకొనే మార్గాలను అవలంబించి, చట్టానికి వ్యతిరేక మైన కార్యక్రమానికి దిగడానికి మనమే ప్రోద్బలం చేసిన వారమవుతాము. అనేకమంది వర్తకులు ఇచ్చిన మెమోరాండాలు చూచినట్లయితే, ఈ మల్టిపుల్ పాయింట్ పన్ను వల్ల ప్రతి చిన్న వర్తకుని నెత్తిమీదికి అనేక చిక్కులు వస్తాయని తెలుస్తుంది. అందుచేత చిన్న చిన్న వర్తకులను మినహాయించవలసి యుంటుంది.

అసలుటోకువర్తకులనుండి మాత్రమే సింగిల్‌పాయింట్ పన్ను వసూలుచేయడం సరియైనది. అందుచేత సాధ్యమైనంత తక్కువమంది దగ్గరనుంచి ఎక్కువ పన్ను వసూలు చేయాలనే సిద్ధాంతం ప్రకారం యీపరిమితి 10,000 నుంచి 7,500 కు తగ్గించడం చాలా అన్యాయం. కనుక దీనిని ఇంకా

ఎక్కువ, అంటే కనీసం 20 వేలో, 25 వేలో చేసేదానికి ప్రభుత్వం పూనుకోవలసి యుంటుందని మా కోరిక. అంతే కాదు, ఇదివరకు 'అన్ని వస్తువులమీద మల్టిపుల్ పాయింట్ పన్ను ఉన్నప్పుడు పదివేలు మొత్తం అమ్మకం పెట్టడానికి బదులు, నికర అమ్మకం పెట్టినారు. ఈ రోజు షెడ్యూల్సు 2, 3 లో ఎక్కువగా ప్రజలు ఉపయోగించే వస్తువు లన్నింటి మీద సింగిల్ పాయింట్ టాక్సు క్రింద, కొనుగోలుపన్ను క్రింద మార్చినారు. ఎప్పుడైతే ఇన్ని వస్తువులకు మల్టి పాయింటునుండి మినహాయింపు ఇవ్వవలసివస్తుందో, వాటి నన్నింటికి టోకు వర్తకునుంచి సింగిల్ పాయింట్ పన్ను వసూలుచేసి చిల్లరవర్తకు లెవరూ కట్టుకోవలసిన అవసరం లేదు అని ఎప్పుడైతే చట్టం చేస్తామో, అప్పుడు మొత్తం అమ్మకం 50,000 ఉంటే నికర అమ్మకం 25,000 కంటె ఎక్కువ ఉండదు. ఇంకా తక్కువే ఉంటుంది.

ఆ రీతిగా కాకుండా, ఈ బిల్లులో చెప్పిన ప్రకారం 7,500 మొత్తం అమ్మకం అన్నప్పుడు, షెడ్యూల్సు 2, 3 లో సింగిల్‌పాయింట్‌లో ఉన్న 42 వస్తువులు మినహాయించేందుకు, వాటిని మేము అమ్మాము అనీ వాటికి లెక్కలు తయారుచేసికొని, వాటిని మినహాయించిన తరువాత మిగిలిన వస్తువులమీద మాకు నికర అమ్మకం 3 వేలో 4 వేలో అనీ చూపి, దానిమీద పన్నులు వేయాలని చెప్పడంకోసం లెక్కలు పెట్టుకోవలసియుంటుంది. ఈ లెక్కలు పెట్టుకోక పోయినట్లైతే ఎంత ప్రమాదం జరుగుతుందో ఆలోచించండి. అది చిన్నచిన్న దుకాణదారులకు ఎంతకష్ట  ోచించండి.

దాని అర్థమేమిటంటే, యీ మినహాయింపు లేకపోయినా ఫరవాలేదు. ఈ లెక్కలన్నీ వ్రాసుకొనే బదులు, మినహాయింపు లేకుండా పన్ను చెల్లించుకోవడమే తేలిక అనుకొని వారికి న్యాయంగా రావలసిన మినహాయింపుకూడా కోరకుండా పన్ను కట్టుకోవలసిన దుస్థితికి చిన్న చిన్న వర్తకులు రావచ్చు.

ఇది కొక విషయం. ఇందులో రు. 7,500 వరకు వర్తకం లిమిట్ తగ్గించారు. అనగా రోజుకు 15 రూపాయలు వరకు వర్తకం చేసేవారన్న మాట. 15 రూపాయల వర్తకం అంటే ఒక వస్తువుమీదే వర్తకం చేస్తారా? చిన్న చిన్న వ్యాపారస్థులు బియ్యం, ఉప్పు, పప్పు, చింతపండు, కారం అనేక రకాల చిల్లర వస్తువులు తెచ్చి అమ్ముతారు. ఆ వస్తువులన్నింటికి ఏ రకంగా లెక్కలుపెట్టి, రసీదులు వ్రాసి అమ్మగలడు! అయితే ప్రజలనుంచి వసూలు చేస్తున్నప్పుడు చిన్న వ్యాపారస్థుడైనప్పటికి పన్ను కట్టుటకు నష్టము ఏమిటని ప్రభుత్వ వాదన. ఆఫీసులో కూర్చొని వర్తకం అంటే ఏమిటో తెలియకుండా, చిల్లర వ్యాపారమంటే ఏమిటో తెలియకుండా చెప్పేవారి కబుర్లు అవి. వారికి డబ్బు బాగా వస్తుంది కాబట్టి చిల్లర దుకాణానికి వెళ్ళి కొనిన పాపాన పోలేదు. హోల్‌సేల్ దుకాణానికి వెళ్లి నెలకో, సంవత్సరమునకో కావలసిన ధాన్యం, పప్పులు కొనుక్కుంటారు. అటువంటి వారికి చిల్లరవ్యాపారం సంగతి తెలియదు.

అధ్యక్షులు : సభ్యులు ఇష్టం వచ్చినంతసేపు మాట్లాడుతామంటే నేను ఒప్పుకోనను. మినిష్టర్లు కానివ్వండి. పార్టీ లీడర్లు కానివ్వండి. 30 నిమిషాలో, 40 నిమిషాలో, ఒక

గంటో మాట్లాడ వచ్చునుగాని. 5 రోజులు మాటాడాలి మా యిష్టం అంటే నేను ఒప్పుకోను. తమ యిష్టం కాదు, ఇక్కడ నా యిష్టం. నన్ను అడగండి. తమకు ఎంత టైము కావలెనో, దానికి ఒప్పుకొనేదీ, లేనిదీ నేను చెబుతాను.

శ్రీ పి. సుందరయ్య. నా యిష్టమని నేను చెప్పుట లేదు. నా యిష్టం అని అంటే అసలు యిక్కడకు రానవసరం లేదు. శాసన సభ్యులకు కొన్ని సాంప్రదాయాలున్నాయి.

అధ్యక్షులు: రెండు గంటలు కావాలి, నాలుగు గంటలు కావాలి అనే సాంప్రదాయాలు నేను ఎరుగను.

శ్రీ పి. సుందరయ్య: దురదృష్టం అక్కడే వస్తోంది.

అధ్యక్షులు: రాజ్యసభగాని, లోకసభగాని నేను ఎరుగను. నేను 29, 30 ఏండ్లనుంచి యీ సభ ఎరుగుదును.

శ్రీ పి. సుందరయ్య: నేను అధ్యక్షులను కోరేది అదే. 30 ఏండ్ల లోపల ఏ బిల్లుమీదనైనా సాధారణచర్చ జరిగేటప్పుడు, ముందు చెప్పకుండా, ఇంతకన్నా ఎక్కువసేపు మాట్లాడకూడదని ఏ అధ్యక్షుడైనా, ఎప్పుడైనా మీ అనుభవంలో రూలింగ్ యిచ్చివుంటే ఉదాహరణ చెప్పమని మిమ్ములను, గోపాలరెడ్డిగారిని కూడ అడుగుతున్నాను. నాకు ఇప్పుడు ఏరూలూ అవసరంలేదుకూడ. నాకు రెండు గంటలు యిప్పుడుకావాలి. అది యిస్తారా? ఎంత యిస్తారో చెప్పండి.

మంత్రి శ్రీ గోపాలరెడ్డి: నాకు రెండు గంటలు కావాలి. ఎంత యిస్తారో చెప్పండి అని బేరమా?

శ్రీ పి. సుందరయ్య: అధ్యక్షులు చెప్పమంటున్నారు బట్టి చెప్పాను. లేక 'నా యిష్టం' అని చెప్పనా?

మంత్రి (శ్రీ) గోపాలరెడ్డి : ...వారు 116 పాయింట్సు రైజ్ చేస్తారు. వాటన్నిటికీ జవాబు చెప్పుట కష్టం నా కిచ్చే 45 నిమిషాలలో.

(శ్రీ) పి. సుందరయ్య : అయితే బిల్లు మూడు రోజులలో ప్యాస్ చేయాలని ఎక్కడైనా ఉన్నదా ?

మంత్రి (శ్రీ) గోపాలరెడ్డి : క్లాజువారీగా తీసుకొన్నప్పుడు వివరంగా మాట్లాడుకొనవచ్చును. ఇప్పుడు సాధారణ చర్చ కష్టం.

(శ్రీ) పి. సుందరయ్య : సాధారణ చర్చను పరిమితం చేయకూడదు. క్లాజ్ వారీ చర్చలో పాయింటుకు, సవరణకు సంబంధించి మట్లాడేటప్పుడు అవకాశం తక్కువగా వుంటుంది. ఆ సందర్భంలో కొత్త పాయింటు తీసుకురావడం అసంభవం. ఇప్పుడు సాధారణ చర్చలో వీలుంటుంది. సూత్రాలమీద, సిద్ధాంతాలమీద యిప్పుడు మాట్లాడ వచ్చును. దానికి అవకాశం యివ్వకుండా, ప్రభుత్వ పక్షమునకు మెజారిటీ ఉన్నది గదా అని ప్యాస్ చేయాలనుకుంటే అది వేరే సంగతి.

అధ్యక్షులు : సుందరయ్యగారూ ! 25 నిమిషాల్లో ముగించండి.

(శ్రీ) పి. సుందరయ్య : 25 నిమిషాలలో కాదు. కనీసం ఒకటిన్నర గంటలైనా కావాలి. లేకపోతే విషయాలన్నీ చెప్పుట సాధ్యంకాదు. మన ఆదాయం 40 కోట్లు. ఇది 10 కోట్ల రూపాయల ఆదాయం తెచ్చే బిల్లు. ఇప్పుడు 365 రోజులకు సంబంధించిన బిల్లు తెచ్చి— దీనివల్ల యింక 95 లక్షల ఆదాయం వస్తుందనీ, దీనిని మూడు రోజులలో

మూడు నిమిషాలలో ప్యాస్ చేయమనీ అడగడం న్యాయం కాదు. నేను తొమ్మిదిన్నరకు మొదలు పెట్టాను.

అధ్యక్షులు : ఇంకొక అరగంట తీసుకోండి.

శ్రీ పి. సుందరయ్య : అరగంటలో చెప్పడం సాధ్యం గాదు. ఇంకా పీఠికలోనే ఉన్నాను. ఇంకా 1 వ అంకం, 2 వ అంకం, 3 వ అంకం, 5 వ అంకందాకా రావలసిఉన్నది. మొట్టమొదటనే అరగంటకు మించి ఎక్కువ ఉపన్యాసము యిచ్చుటకు వీలు లేదని అంటే, దానిని గురించి ఏమి చేయాలనేది అప్పుడు ఆలోచించుకొనెడివారము.

అధ్యక్షులు: ఇవ్వాళ ఒక గంట యిస్తాను. రేపటి నుంచి అరగంటకంటె ఎక్కువ మాట్లాడకూడదని ముందుగానే చెబుతాను.

శ్రీ పి. సుందరయ్య : ఏమైనాసరే, ఈ సమస్యను గురించి యింకా చూడవలసి వుంటుంది. బిల్లుమీద చర్చను గురించి రూల్సు సక్రమంగా లేకపోతే ఛేంబర్‌లోనో, రూల్సు కమిటీలోనో ఈ విషయం ఆలోచించాలి. మేముకూడ ఆటంకాలు పెట్టాలనికాదు. అసంభవంగా యింత బిల్లు తెచ్చి మూడురోజులలో ఎట్లా ప్యాస్ చేస్తారు ? దీనికి సంబంధించిన పాయింట్సు అన్నీ మాట్లాడడానికి మాకుకూడా టైంకావాలి.

మంత్రి శ్రీ గోపాలరెడ్డి : 40 క్లాజులబిల్లు మూడు దినాలలో ప్యాస్ చేయలేకపోతే ఎట్లా?

శ్రీ పి. సుందరయ్య : 365 రోజులలో 3 వేలమంది సిబ్బందిని పెట్టుకున్నా చేయలేరుగాని, శాసనసభ్యులు

3 రోజుల్లో, 3 నిమిషాలలో ప్యాస్ చేయమంటే ఎట్లా సాధ్యమవుతుంది ? అది సాధ్యంకాదని మేము చెబుతున్నాము.

అధ్యక్షా ! చిల్లర వర్తకం ఏరీతిగా జరుగుతుందో తెలియనివారు ఈ మాటలు చెప్పవలసినదేతప్ప తెలిసినవారు చెప్పరు. రోజుకు 15 రూపాయల వ్యాపారం చేసేవారు అనేక రకాలైన వస్తువులు అమ్మవలసి వచ్చినపుడు అణాకు, రెండణాలకు, నాలుగణాలకు అమ్మే చిల్లర వస్తువులకు ఏ విధంగా లెక్కవ్రాసి, పన్ను వేసి బిల్లు యిస్తారు ? అందులో కొన్ని మినహాయింపు వస్తువులు, కొన్ని మినహాయింపు లేనివి ఉంటాయి. వీటన్నిటికి లెక్కలు వ్రాయటం సాధ్యంకాదు. ప్రభుత్వ డిపార్టుమెంటులలో అనుభవమున్న ఎవరినైనా అకౌంటెంటును తీసుకువస్తే వారిని నేను ఒక చిల్లరదుకాణందగ్గర కూర్చోబెడతాను. అక్కడ రోజుకు 15 రూపాయలు అమ్మే అమ్మకములకు, ఏ వస్తువు ఎంతెంత అమ్మాడో, దేనికి ఎంత పన్నో బిల్లులు వ్రాసియివ్వగలడా ? అణాకు, రెండణాలకు సేల్సుటాక్సు ప్రజలనుంచి వసూలు చేయగలడా ? సామాన్యంగా చిల్లరవ్యాపారస్థులు యింత అమ్మినామని మొత్తంగా చూచుకొని, లాభాలు, నష్టాలు పోను, పన్ను కట్టవలసినదేగాని, ప్రతి చిన్నవస్తువుకు అణాకు, రెండణాలకు ప్రజలనుంచి వసూలుచేయటం అసంభవమైన విషయం. ధరలు ఎక్కువ వేసుకోవచ్చు. తక్కువ వేసుకోవచ్చు. కాబట్టి ఈ లిమిట్‌ని రు,7,500 కు తీసుకురావటంఅంటే గాయంలో కారం పెట్టటం. ఇంకొకపొరపాటు ఏమంటే నికర అమ్మకాన్ని మొత్తం అమ్మకంగా మార్చడం.

## రిజిస్ట్రేషన్, లైసెన్సు

తరువాత రిజిస్ట్రేషన్ ఉన్నది రు. 7,500 నుంచి యిప్పుడు 5 వేలు చేశారు. సెలెక్టు కమిటీలో యిచ్చిన లెక్కల ప్రకారం 10 వేలనుంచి రు.7,500 అమ్మకంలిమిట్ తగ్గిస్తే కొత్తగా 7 వేలమంది అదనంగా పన్ను కట్టవలసివస్తుందని చెప్పారు.

ఏడు వేలమంది అదనపుపన్ను కట్టవలసివస్తుందా ? లేక ఇంకా ఎక్కువమంది కట్టవలసివుంటుందా ? దీనికి సరైన అంచనాలు ఉన్నాయా అనేది అనుమానంగా ఉన్నది. ఏడు వేలని అంగీకరించినా, ఇంత తొందరగా అదనంగా పన్ను వేసి మీరు లాభపడబోయేది ఎంత ? అందులో నెట్ టరన్ఓవర్ ప్రకారం నూటికి 50 వరకు అయినప్పుడు మూడు వేల ఏమ వందల రూపాయలు పన్ను కట్టుకోవలసియున్నది. సంవత్స రానికి మనిషిదగ్గరనుంచి రు. 5,500 కన్నా ఎక్కువ వసూలు చేయటానికి సాధ్యమా ? రు. 7,500 కు చూచుకొన్నప్పటికీ కూడ పదిలక్షలు, పదిహేను లక్షలకన్నా హెచ్చు వసూలు అయ్యేది కాదు. ఈ పదిహేను లక్షల డబ్బుకోసం ఏడు వేల మంది చిన్న వర్తకులను పీడించటమనేది న్యాయమాఅని అడుగు తున్నాను. ప్రభుత్వం పన్ను వేసేపద్ధతి తప్పు. ప్రజ మీద ఎంత కావాలంటే అంత అపరాధాలు వేసేదానికి ఉద్యోగ బృందానికి పెత్తనం యివ్వటానికే యిది ఉపయోగపడు తుంది తప్ప, ప్రభుత్వానికి ఒక దమ్మిడీ ఎక్కువ వచ్చేదానికి ఏమీ ఉపయోగపడదు. ప్రజలకు, ప్రజా ప్రతినిధులకు

మరింత ద్వేషం, అసహ్యత కలిగించటానికి మాత్రమే యీ బిల్లు ఉపయోగపడుతుంది.

ప్రజలు నిత్యమూ ఉపయోగించే వస్తువులమీద పన్ను వేయవద్దని చెప్పాను. తెలంగాణాలో బెల్లంమీద పన్ను లేదు. వంటచెఱకుమీద లేదు. కట్టెలమీద లేదు. ఎరువుల మీద లేదు ఉల్లిపాయలు, బంగాళాదుంపలు మీద లేదు. వీటన్నిటిమీద ఇవాళ అదనంగా పన్ను వేసి ఎంత సంపాదిస్తారు? వీటన్నింటికి కలిపి ఎంత ఆదాయం వస్తుందని సెలక్ట్ కమిటీలో అడిగితే, యీ ఉల్లిపాయలమీద, బంగాళాదుంపల మీద ఒక లక్షరూపాయలు మించిరాదన్నారు.

ఈ లక్ష రూపాయలకోసం చిన్నచిన్న వర్తకుల మీదకు సైన్యాన్ని పంపించి - సైన్యమంటే పన్నులు వసూలు చేసే సైన్యం అనుకోండి - ఏ విధంగా ఆదాయాన్ని పెంచి ప్రజలకు ఉపయోగపడే పనులు చేయబోతారో మాకు అర్థంకాదు.

## పన్నుల విచారణకమిషన్ సూచనలు త్రోసివేసింది యీ చట్టం

పన్నుల విచారణ కమిషన్ ఏమి చెప్పింది? "ప్రజలు నిత్యము ఉపయోగించే వస్తువులమీద పన్నులు వేయవద్దు; ఉన్న పన్నులను తగ్గించండి. కనీసం ఉన్న పన్నులైనా ఎక్కువ చేయవద్దు" అని కమిషన్‌వారు చెబితే, "మాకు ఆదాయం కావాలి" అని ప్రభుత్వంవారు చెబుతున్నారు. "బియ్యం మీద, గోధుమలమీద సింగిల్‌పాయింట్ టాక్సు తెచ్చాము; దానిని గురించి ఆలోచిస్తాము" అని చెబుతున్నారు.

## జొన్నలు, సజ్జలు, కొఱ్ఱలు

"మెట్టప్రాంతములో ఉండే ప్రజలు – పేదప్రజలు – ఉపయోగించే జొన్నలు, సజ్జలు, కొఱ్ఱలు, రాగులమీాద పన్ను వేయకండి"అని అందరూ ప్రభుత్వ ఉద్యోగస్తులు, సేల్సు టాక్సు కమిటీలో ఉన్న కాంగ్రెసువారు, వర్తక ప్రముఖులు, మాజీమంత్రులు ఏకగ్రీవంగా చెప్పారు. వీల్లేదంటోంది ప్రభుత్వము. ఆఖరుకు సెలెక్టు కమిటీలో రెండు గంటలు చర్చించిన తరువాత మంత్రిగారు మహోదయుతో "పోనీ లే; ఇంతగా అడుగుతున్నారు; కాబట్టి ఒక నయాపైస సింగిల్ పాయింట్ ప్రకారం వేస్తాము" అన్నారు. ఇదీ జరిగిన సంగతి. ఇది వారు ఇచ్చినటువంటి బ్రహ్మాండమైన 'సౌకర్యము.' దీనివల్ల పన్నులు రావు. ఆదాయమూ పెరుగదు. తిట్లు వచ్చేటట్లుగా పన్నులు పెంచుకోవటం జరుగుతుంది.

## ఉల్లిపాయలు, కూరగాయలు

ఉల్లిపాయలమీాద, కూరగాయలమీాద పన్ను వేయకూడదని అన్నాం. కూరగాయలు ఏ పూటవి ఆ పూటకే ఉంటాయి. ఆ తర్వాత చెడిపోతాయి. పెరిషబుల్ గూడ్సు కాబట్టి వేయగూడదని అన్నాం. ఉల్లిపాయలు చెడకుండా ఒక సంవత్సరం ఉంటాయా? ఎంతో జాగ్రత్తగా ఉంచి, ఎండబెట్టినట్లయితే ఒకటి రెండు నెలలు ఉంటాయి. ఈరోజు తూచినదానికన్నా, పదిహేనురోజుల తర్వాత చూస్తే తూకం తగ్గుతుంది. అదికూడా పెరిషబుల్ ఫుడ్ కాబట్టి దానినికూడ కూరగాయలక్రింద తీసుకొని పన్ను లేకుండా చేయాలని చెబు

తున్నాము. ప్రజలకు అత్యంత అవసరమైన వస్తువులపైన పన్ను మినహాయించాలి. సెలెక్ట్ కమిటీలో యీ సమస్య వచ్చినప్పుడు, ప్రభుత్వమువారు అన్నారు: "ఉల్లిపాయలమీద తీసేస్తే చింతపండుమీద తీసెయ్యమంటారు; కారంమీద తీసెయ్యమంటారు" అని. నిజమే చింతపండు, మిరపకాయలు, కారం, ఉల్లిపాయలు వీటిని సేల్సుటాక్సునుంచి మినహాయించాలి. ప్రజలు ఏదో కారం మెతుకులు తింటూంటే, ఆ కారం మెతుకులమీదకూడా పన్ను వేస్తే ఎట్లా? కడుపునిండా మీరు పంచభక్ష్యపరమాన్నాలే పెడితే, అప్పుడు పాయసంమీద, యీ రిఫ్రెజిరేటర్సుమీద, రేడియోలమీద, విలాస వస్తువులమీద పన్ను మానేసి, ఆ రోజు మిరపకాయలు, ఉప్పు, కారంమీద పన్ను వేసుకోవచ్చును. ఈ పంచభక్ష్యపరమాన్నాలను ప్రజల కివ్వకపోగా మీరు "తినే కారం మెతుకులమీద పన్ను వేస్తాను; జొన్నలమీద పన్ను వేస్తాను? రాగులమీద పన్ను వేస్తాను" అని అంటే అది ఏ విధంగానూ సమర్థనీయంకాదని చెబుతున్నాను.

మంత్రి శ్రీ గోపాలరెడ్డి: 1939 నుంచి మిల్లెట్స్ పైన ఉన్నాయి. ఈనాడు అవి కొత్తగా ఆకాశంనుంచి దిగివచ్చినవి కాదు.

శ్రీ పి. సుందరయ్య: 1939 నుంచి వచ్చినదానితో ఆగుతారా? దానిలోఉన్న చెడునుతీసుకొంటున్నారు. తెలంగాణాలోఉన్న చెడును తీసుకొంటున్నారు. వీటన్నింటినికలిపి, ప్రజలమీద యీ నాడు అదనంగా పన్నులు వేయడానికి ప్రయత్నం చేస్తున్నారు. 1939 నుంచి మిల్లెట్స్ మీద ఉంది

నిజమే. అప్పటి ప్రకారమే చేస్తారా? ఆ విధంగాచూస్తే, అసలు తెలంగాణాలో సేల్సుటాక్సు లేదు.

మంత్రి శ్రీ గోపాలరెడ్డి: అసలు అప్పుడు తెలంగాణా లేదు.

శ్రీ పి. సుందరయ్య: తెలంగాణా అప్పుడూ ఉన్నది. ఇప్పుడు అది ఆంధ్రప్రదేశ్‌లో వుంటే, అప్పుడు అది మరో ప్రాంతంక్రిందఉన్నది. పురాతనకాలంనుంచికూడా తెలంగాణా ఉన్నది. మనకోస్తాప్రాంతం నదుల అవతల వున్నది.

ఈ తెలంగాణా ప్రాంతం, యీ దక్కన్ పీఠభూమి భూగర్భశాస్త్రరీత్యా కోస్తాప్రాంతం రాకముందునుంచీ, అతి ప్రాచీనమైన భూభాగంగా ఉన్నది. ఈ దక్కన్ పీఠభూమి, ఈ తెలంగాణా భూభాగము హిమాలయాలకన్నా ప్రాచీన భూభాగం. తెలంగాణాభూమి లేకపోలేదు. పోతే అది ఎవరి క్రింద ఉన్నదనేదే సమస్య. కోస్తాప్రాంతంలో పుట్టిన మనం కొత్తగావస్తే వచ్చివుండవచ్చు కాని, తెలంగాణా చాలా పాతకాలంనుంచీ ఉన్నది.

## గుడ్డలు

తరువాత, గుడ్డలమీద పన్ను వేయటం జరిగింది. సన్నని గుడ్డలు, అతిసన్ననిగుడ్డలు యీ చీనిచీనాంబరాల మీద పన్ను వేసుకొంటామంటే ఎవరికీ అభ్యంతరం లేదు. కాని మీడియమ్‌క్లాత్, కోర్సు క్లాత్ మీద పన్నులు ఎక్కువ వేయడం న్యాయంకాదు.

ప్రభుత్వంచెప్పే వాదనంతా ఏమిటంటే, "జూలై ఒక టవ తేదీనుంచి కేంద్రప్రభుత్వం వీటన్నింటికి ఎక్సైజు సర్ ఛార్జి వేస్తుంది; ఆ సర్ఛార్జీలో మనకు భాగంవస్తుంది" అని. ఈ విషయంలో కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వానికి చేసిన వాగ్దానం ఒకటిఉన్నది. 'మీరింతవరకు ఎంతవసూలు చేస్తున్నారో అంతకుతగ్గకుండా మేముమీకుఇస్తామని'అన్నారు. "ఇప్పుడు మనం ఎక్కువ పన్నులు వేసుకొని, ఎక్కువడబ్బు వసూలు చేసుకొన్నామని మనం కేంద్ర ప్రభుత్వానికి చూపితే, కేంద్ర ప్రభుత్వం అంత డబ్బు మనకు ఇస్తుంది. కాబట్టి పన్నులు తగ్గించటానికి వీలులేదు. ఇంకా హెచ్చు చేసుకొంటే మంచిది" అని ప్రభుత్వమువారు చెబుతున్నారు. ఈ బిల్లును మే నెల 6 వ తేదీలోగా పూర్తిచేస్తాము. నెలాఖరులోగా చట్టమవుతుంది. పోతే జూన్ నెలాఖరు లోపల, ఒక్క నెలలో ఎంత పన్ను వసూలు చేయగలరు? అది ఏవిధంగా సాధ్యమవుతుంది? ఇంత వసూలు చేశాము. ఇంత డబ్బు మాకు యివ్వాలని కేంద్ర ప్రభుత్వాన్ని ఎట్లా అడగగలరు? కేవలం వాదించటం కొరకు కళ్ళనీళ్ళు తుడవడానికి యీవాదన పనికివస్తుంది. "మాకు ఎక్కువ ఆదాయం వచ్చింది. మీరు అంత డబ్బు మాకు ఇవ్వాలి" అనే వాదనతో కేంద్ర ప్రభుత్వమునుంచి ఎక్కువ డబ్బు రాబట్టడానికి చూడటం ఎంతో ఆశ్చర్యంగా ఉన్నది.

అయితే కేంద్ర పభుత్వముతో "మా రాష్ట్రములో ఇంత జనాభా వున్నది. మా రాష్ట్రము ఆర్థికంగాను, విద్యావిషయికంగాను, రాష్ట్రముయొక్క జనాభానుబట్టి మా

డిమాండు ఈవిధముగా ఉంటుంది" అని చెప్పవలసింది. అట్లా చేయకుండా మేము ఇంత ఎక్కువ పన్ను వేసుకుంటాము అంతకు తక్కువకాకుండా మాకు ఇవ్వండి అని అడగడము సరియైన పద్ధతికాదు. అయినను జూలై నెలనుంచి కేంద్ర ప్రభుత్వముయొక్క బిల్లు అమలులోనికి రాబోతున్నది. ఇంక ఒక్క నెలమాత్రమే వ్యవధియున్నది. ఈ నెలరోజుల లోపలనే ఇంత తొందరగా మన పన్నుల హెచ్చింపును కేంద్ర ప్రభుత్వము ఇవ్వబోయే వాటాకు పోటీబెట్టి, కేంద్ర ప్రభుత్వాన్నుంచి ఎక్కువ డబ్బు సంపాదించాలని ఉద్దేశించి, ప్రజలమీాద పన్ను హెచ్చు చేయడమనేది అర్థరహితము. దీనికి ఎవ్వరూ సమ్మతించరు. కాని నాకు కలిగే అనుమానము యేమిటంటే- మన రాష్ట్రములో మధ్యరకం గుడ్డమీాద, ముతకగుడ్డ మీాద ఎక్కువ పన్ను వేస్తే, ఇక కేంద్ర ప్రభుత్వానికి మనము చెప్పగలిగినది ఏమివుంటుంది ?

సన్నని, అతిసన్నని గుడ్డ విదేశాలకు పంపించవలసి యుంటుంది. ముతకగుడ్డ మీాద రాష్ట్ర ప్రభుత్వము ఇదివరకే ఎక్కువ సర్ఛార్జి వేస్తున్నారు గనుక, ఆ వేసే ఎక్కువ సర్ఛార్జి ఈ సన్నని, అతిసన్నని బట్ట మీాదవేసి, రాష్ట్ర ప్రభుత్వము ఇప్పటివరకు ఎంత వసూలు చేస్తున్నదో అంతకు తక్కువకాకుండా, ఆ రేటులోనే భర్తీ చేస్తామని చెప్పితే, అప్పుడు మాత్రము కొంప మునిగిపోయ్యేది ఏమివున్నది. ? "మేము మా ప్రజలమీాద యెక్కువ పన్ను వేస్తున్నాము. అందువల్ల ఆ పన్నుఅంతా అంతకు తక్కువలేకుండా మీారు ఇవ్వండి" అని కేంద్ర ప్రభుత్వాన్ని అడిగేబదులు

ముతకగుడ్డ మీాద, మధ్యరకంగుడ్డమీాద పన్ను లేకుండా చేయడం మంచిది. "మేము ఎక్కువ సర్చార్జి వేస్తాము. మీారు వసూలు చేసుకునేదానికంటే తక్కువ కాకుండానే ఇస్తాము. కాని, సన్న గుడ్డమీాద, అతిసన్న గుడ్డమీాద పన్ను తక్కువగా వేస్తామని" వారు అంటే మనము చేసేది ఏమిటి? అందువల్ల సామాన్య ప్రజలు ఉపయోగించుకొనే ముతకగుడ్డ, మధ్యరకంగుడ్డమీాద ఎక్కువ పన్ను వేస్తామనేది చెడ్డసూత్రము చెడ్డ సాంప్రదాయము అని చెప్పవలసి ఉంటుంది. విదేశాలకు ఎగుమతి సాగిస్తామనే పేరుతో, అక్కడికి పంపించే వస్తువులమీాద ఇంకా తక్కువ పన్ను వేసుకోటానికి మనమే ఒప్పుకున్న వారమవుతాము. దానికి మాత్రము మేము తయారుగాలేము. మేమే కాదు. ఏరాష్ట్ర ప్రభుత్వము కూడా తయారుగా వుండకూడదు. అందువల్ల ఈ మధ్యకరం బట్టమీాద, ముతకబట్టమీాద పన్ను చాలామటుకు తగ్గించాలని నా సూచన.

## చక్కెర, బెల్లం

చక్కెర, బెల్లము మీాద తెలంగాణాలో మాత్రము మొన్న మొన్నటి దాకా పన్ను లేదు. చక్కెర మీాద రు. 0-1-3 పన్ను ఉండేది. ఆంధ్ర రాష్ట్రము ఉన్నప్పుడు దీన్ని మార్చటానికి ఒకసవరణ ప్యాస్ అయినప్పటినుంచీ, అంటే ఈ ఆరునెలలనుంచి పన్ను వేయడము జరుగుతున్నది. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డది. అదేమాదిరి తెలంగాణాలో కూడా ఈ పన్ను పెంచటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది. పోనీ. రు. 0-1-3 తో నైనా ప్రభుత్వం ఆగినదా? ఇప్పుడు

నయా పైసలు వచ్చినవి గనుక, ఇంకా ఒకపరసెంటు ఎక్కువ చేయటానికి చూస్తున్నారు. ఈ రీతిగా ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వం ఇక్కడ ఎంత ఎక్కువ పన్నువేసి వసూలు చేసుకుంటే, అంత ఎక్కువ రేపు కేంద్ర ప్రభుత్వమునుంచి సంపాదించుకోటానికి ఆలోచిస్తున్నారు. కేంద్రప్రభుత్వోద్యోగులు నిద్రపోతున్నారనీ, మన రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు మేల్కొని వున్నారనీ అనుకొని. కేంద్రప్రభుత్వోద్యోగులను తేలికగా ఢోకా కొట్టవచ్చునని అనుకొన్నారు కాబోలు. కేంద్ర ప్రభుత్వోద్యోగులు అంత తేలికగా మీరు వేసే వలలోపడరు. వారు కూడా కేంద్ర మేల్కొనే ఉన్నారు. అయితే మీరు ఎంత వసూలు చేసుకుంటూంటే మేము అంతకు ఒక్కపైసా కూడా తక్కువ లేకుండా ఇస్తామని కేంద్ర ప్రభుత్వం చెప్పినట్లయితే, ఆవిధంగా చెప్పేసూత్రం తప్పు. "దానికి మేము అంగీకరించం. మా రాష్ట్ర జనాభా ప్రకారం ఇవ్వండి" అని రాష్ట్ర ప్రభుత్వం కోరాలి.

మంత్రి శ్రీ గోపాలరెడ్డి: కేంద్ర ప్రభుత్వంవారు యింతవరకు ఏ సిద్ధాంతంకూడ నిర్ధారించి చెప్పలేదు. రాష్ట్ర ప్రభుత్వం ఎంత వసూలు చేసుకుంటున్నదో అంతకు తక్కువ కాకుండా, యింకా హెచ్చుగానే యిస్తామనే భావం సూచించినారు. అంతేకాకుండా రాష్ట్ర ప్రభుత్వములు అన్నీ ఒప్పుకొని తీసుకున్నదేకాని, వారు ఏదో గ్రహించి తీసుకున్నది కాదు.

శ్రీ పి. సుందరయ్య: వచ్చినచిక్కల్లా అక్కడే; ఈ విధానానికి రాష్ట్ర ప్రభుత్వాలు ఒప్పుకోవడమే మొదటితప్పు.

అసలు ఏ మూలసూత్రంమీద యీ సర్చార్జి వేయబోతు న్నారు? మధ్యరకం గుడ్డమీద ముతకగుడ్డమీద తక్కువగా వేసి, సన్న, అతి సన్నబట్టమీద ఎంత వేయడము అనేది తెల్పుకోలేదు. ముతక గుడ్డమీద రాష్ట్ర ప్రభుత్వాలు ఎక్కువవేసి, కేంద్ర ప్రభుత్వానికి దారిచూపి నట్లు అవుతున్నది. కేంద్ర ప్రభుత్వంయొక్క విధానం యిందులో స్పష్టంగా కనబడుతున్నది. విదేశాలకు ఎగుమతి అయ్యే వస్తువులమీద పన్నులు తక్కువవేసి పేద ప్రజలు, సామాన్యప్రజలు ఉపయోగించుకొనే గుడ్డమీద యెక్కువగా వేయజూస్తున్నారు. దీనికి మన రాష్ట్రప్రభుత్వము ఒప్పుకుంటే అది తప్పు అనవలసి ఉంటుంది.

## ప సు పు

తరువాత పసుపు విషయము తీసుకోండి. బిల్లులోని మూడవ షెడ్యూలు చూడండి. ఇందులో అభ్రకం, మేంగనీస్, ఇనుం, పుగాకు, బియ్యం, కొబ్బరి, వీటి అన్నిటిమీద మూడేసి నయాపైసలు వేస్తున్నారు. పసుపు దగ్గరకు వచ్చేటప్పటికి ఆరు నయాపైలు అంటున్నారు. ఎందుకు? పసుపు చేసుకున్న ప్రత్యేక పాపం ఏమిటి? మిగిలినవి ఆరు నయాపైసలు భరించలేనపుడు ఈ ఒక్క పసుపు మాత్రం భరించుకోగలదా? వాస్తవంగా చూస్తే, యీ రోజులలో పసుపు పేదప్రజల దగ్గరనుంచి అందరూ ఉపయోగించుకునే వస్తువే. దానిమీద ఎక్కువ పన్ను వేస్తే పేదవాళ్ళు భరించుకోలేరు. అందువల్ల పసుపుకుగూడ పన్ను మూడుపైసలకు తగ్గించండి.

పసుపు వ్యాపారస్తులకు పసుపుమీద ఎక్కువగా లాభాలు వస్తాయి. ఆ పైకం రాష్ట్రంలోని అభివృద్ధికార్య క్రమాలకు ఉపయోగించవచ్చునుగదా! అమ్మకపుపన్ను విచారణకమిటీ అభిప్రాయం వెలిబుచ్చారు. ఈపన్ను రైతుల వద్దనుంచి వసూలు చేయకూడదు. ఇది రైతులమీద పడకుండా, మొట్టమొదటి కొనుగోలుదార్ల వద్దనుంచే వసూలు చేయాలి. దానికి తగిన రూల్సు మేము చేస్తాం అని ఉద్యోగ బృందం, మాజీమంత్రులు, ప్రస్తుత మంత్రులు చెప్పినారు. అయితే ఇది ఆచరణలో ఎట్లా జరుగుతున్నదో తెల్పుతూ నా వద్దకు అనేక పిటీషనులు వచ్చినవి. ప్రతి వ్యాపారస్థుడు రైతు దగ్గరనుంచి పొగాకుకొన్నప్పుడు అమ్మకపుపన్ను అని వ్రాయటానికి బదులు, కమిషను అనో. ధర్మమనో ఏదో విధంగా తప్పించుకోటానికి వీలు ఉంటున్నది. ఇదివరకులేని కమీషను అనేది తెచ్చిపెట్టడం కొత్త సాంప్రదాయం. కొనుగోలు పన్ను అనేది యీ వ్యాపారస్థులు ఎంత కట్టుకోవలసి ఉంటుందో, అంతాకూడ రైతుల దగ్గరనుంచే వసూలు చేస్తున్నట్లు కనబరుస్తున్నారు. ఇది ఏమిటి అని అడిగితే "ఇది కమిషను క్రింద" అని, "ఇది ధర్మముక్రింద" అని చెబుతూ, దీనిని రైతులనుంచి మినహాయింపు చేస్తున్నట్లు తెలుస్తున్నది. దీనిని మానిపించండి అని ప్రభుత్వమును కోరినా, "యీ విషయంలో మే మేమి చేయలేము" అని చెబుతున్నారు.

అంతేకాకుండా పసుపు పుట్టి ఒకటింటికి యిదివరలో ఏ మూడు వందలో ఉంటూ ఉండేది. అలాంటిది యిప్పుడు ఏ నూరు, నూటయాభై రూపాయలకో తగ్గినది. పసుపుకు

ధర లేనప్పుడు, యీ పన్నుభారం ఎప్పుడు చూచినను ఒకే రేటులో వసూలు చేస్తున్నారు. అసలు యీ పన్ను రైతు వద్దనుంచి వసూలు చేయడమనేది తీసివేసే సంగతి అటుంచి, యీ పన్నుభారం తగ్గించటానికైనా ప్రభుత్వం పూనుకోకుండా, "మాకు యిప్పుడు డబ్బు కావాలి" అని పన్నును పెంచడం సరైనదికాదు.

## సోదాలు, శిక్షలు

ఈ చట్టంలో ఉన్న మరొక ముఖ్యవిషయం వర్తకులను వేధిస్తున్న శిక్షలు. అపరాధ పన్నులు, నేరాలు చేసినందుకు ప్రభుత్వం విధించేశిక్షలు సెక్షన్లు 28, 29, 30, 31 ఈ నాలుగూ దీనికి సంబంధించినవే. వర్తకులందరూ ప్రధానంగా వ్యతిరేకించింది సోదాచేసే, మరియు స్వాధీనం చేసుకొనే అధికారం. ఈ అధికారం ఉద్యోగులకు ఉండవలెనా? ఉండకూడదా అనే సమస్య మీద చాలా తర్జన భర్జనలు జరిగాయి. 1956 సవరణ చట్టం వచ్చేవరకు ప్రతి ఉద్యోగి వెళ్ళి సోదాచేసి పుస్తకాలు స్వాధీనం చేసుకొనేదానికి అధికారం లేదు. అయితే అదివరకు సోదాలు చేయలేదా అంటే, కోర్టుకు వెళ్ళి దెబ్బలాడే శక్తి లేకో, తెలియకో వర్తకులూరుకున్నారు. నిజంగా అటువంటి అధికారాలు మాకు లేవు అని అధికారులంతా ఏకగ్రీవంగా అంగీకరించారు. అయితే తప్పుడు లెక్కలు పెడుతున్నారు. పన్నుకట్టాల్సింది చూపించడంలేదు. పన్నులు ఎగవేస్తున్నారు. వీటన్నింటిని తనిఖీచేయాలంటే సోదాచేసే అధికారం ఉండాలి. సోదాచేసిన తరువాత కనపడని పుస్తకాలు ఉంటే, వాటిని స్వాధీనం చేసుకొనే

దానికి హక్కు ఉండాలి అని అధికారులు కోరితే, పన్ను వేసినపుడు ఆపన్నునుసక్రమంగా వసూలు చేసేదానికి కొన్ని అధికారాలు ఉండాలి అని కోరితే, దానిలో మాకేమి అభిప్రాయ భేదం లేదు. అయితే వర్తకులు చెప్పే విషయం ఏమిటి? మేము పన్ను కట్టడానికి, లెక్కలు చూపించేదానికి తయారుగానే ఉన్నాం. లెక్కలు చూపించనివాళ్ళమీాద, పన్ను కట్టనివాళ్ళ మీాద ఏ శిక్షలు, ఏ నిర్బంధాలు వేసినా సిద్ధంగానేఉన్నాం. కాని మీా ఉద్యోగులంతా నీతిపరులనిగాని, సన్మార్గులని గాని, చట్టాలప్రకారం సక్రమంగానడచుచున్నారనిగాని మాకు ఏ మాత్రంకూడా నమ్మకం లేదు అని అంటున్నారు. అమ్మకపుపన్ను విచారణ కమిటీ ముందు ఈ విషయం వచ్చినపుడు మేము ఉద్యోగస్థులను అడిగాము : "ఉద్యోగస్థులలో లంచ గొండితనం ఎంత ఉంటుంది" అని. లంచాలు తీసుకొనేవాళ్లు 100 కి ఇద్దరు ముగ్గురుకన్న ఎక్కువలేరు. మిగతా వాళ్లంతా సన్మార్గులనే చెప్పారు. వర్తకులను అడిగితే 100 కి 70 మంది లంచాలు తీసుకుంటారు. అంతకన్న ఎక్కువే ఉంటుంది కాని, తక్కువ లేదని ప్రతి వర్తక ప్రతినిధి చెప్పారు.

మంత్రి శ్రీ గోపాలరెడ్డి: వర్తకులలో జమాఖర్చులను ఎంతమంది దాచేస్తున్నారో అడిగారా?

శ్రీ పి. సుందరయ్య : అదికూడా అడిగాం. అడిగితే దాదాపు అందరూ అని చెప్పారు. చేస్తున్నాం, ఇకముందు చేస్తామని కూడా చెప్పారు. ఆ విషయంలో వాళ్ళేమీా దాచుకోలేదు. మీా పన్ను ఈ విధంగా ఉన్నంతకాలం, మీాఉద్యోగస్తుల ప్రవర్తన ఈ రీతిగా ఉన్నంతకాలం, మీా బలాన్ని

ఉపయోగించి పెద్దపెద్దవాళ్ళను నొక్కి పెట్టి, చిన్న వాళ్ళ దగ్గర వసూలుచేస్తూ మీరు మీ శక్తిని చూపిస్తామని అనుకొన్నప్పుడు, మా శక్తితో మేము చేయగలిగినంతవరకు చేస్తాం అన్నారు వర్తకులు. ఏమీ అబద్ధం చెప్పలేదు.

వాళ్ళు ఆ రకంగా చెప్పడం ఆశ్చర్యం ఏమీ లేదు. అయితే వాళ్లు ఒకవిషయం చెపుతున్నారు: "మీరు మమ్మల్ని నమ్మండి. మిమ్మల్ని మేము నమ్ముతాం. మీ ఉద్యోగస్తులకు కావలసిన తోడ్పాటు అన్నీ మేము ఇస్తాం. అంతేకాని మమ్మల్ని మీరు నేరస్థులుగా పరిగణించి, దొంగతనం చేసే దానికోసమే మేము కూర్చున్నట్లు మీ ఉద్యోగస్థులు సన్మార్గులు, న్యాయపరులైనట్లు అనుకోవడం సరైనదికాదు. మాకు యీ అమ్మకంపన్నులో కొన్ని ఇబ్బందులు ఉన్నాయి. చిన్నవాళ్ళమీదనే అనేకం పడుతున్నాయి. అందుచేత మా ఇబ్బందులను కూడా మీరు గమనించి, మేము దివాళా తీయకుండా, మేము కాస్త తిని బ్రతికేదానికి మార్గం చూపితే, ప్రభుత్వం యొక్క ఆదాయం పెరిగేదానికి అన్నిరకాలా సహకారం చేస్తాం" అని కూడా చెప్పారు. ఇంకో ప్రశ్న కూడా అడిగాం: "ఈ అమ్మకం పన్ను మీ స్వంత లాభాల నుంచి కట్టమనలేదుకదా? ప్రజల దగ్గరనుంచి వసూలు చేసుకోడానికి హక్కు యిచ్చాం. ఆ వసూలు చేసినదానిని ప్రభుత్వానికి కట్టమంటే మీకు వచ్చిన నష్టం ఏమిటి? ఎందుకు కట్టరు" అని అడిగితే వాళ్లు చెప్పింది యిది: "ప్రజల దగ్గరనుంచి వసూలు చేసినది కట్టడానికి మాకేమీ అభ్యంతరం లేదు. మేము కడతాం. మల్టీపాయింట్ వల్ల వర్తకంలో

అనేకరకాలుగాపోటీపడడం, ఒకవర్తకుడు యెక్కువ ధరకు అమ్మడం, ఇంకోవర్తకుడు తక్కువధరకు అమ్మడం, దీనివల్ల చాలమంది వర్తకులు దివాళా తీయవలసివస్తోంది. అధికారులకు మేము ఖచ్చితంగా లెక్కలు చూపించి, ఆ లెక్కల ప్రకారం పన్నుకడితే, ఇన్‌కంటాక్సువారు వచ్చి నీ కింత అమ్మకం ఉన్నది. ఇంత అమ్మకం పన్ను వసూలుచేశావు అంటే, ఇంత ఆదాయం ఉండితీరాలి అని మేము యిచ్చిన లెక్కలు త్రోసిపారేసి. ఇవన్నీ తప్పుడు లెక్కలు, మేము నమ్మం అని వాళ్ళ యిష్టం వచ్చినట్లు పన్ను వేసి, నీవు కావాలంటే కోర్టుకు వెళ్లు అని చెప్పి మామీద విపరీతమైన ఆదాయపు పన్ను వేస్తున్నారు. దానితో మేము దివాళా తీస్తున్నాం. సేల్సుటాక్సుకోసమని సక్రమమైన లెక్కలు చూపించి దానినుంచి బైటపడి, దానివల్ల నష్టం లేకపోయినా ఇన్‌కంటాక్సువల్ల దివాళాతీస్తున్నారు. ఒక డిపార్టుమెంటుకు, ఇంకో డిపార్టుమెంటుకు సంబంధం లేదనే విషయం అందరికీ తెలుసు. దానికి అనేక ఉదాహరణలు చెప్పారు. ఆఖరికి వాళ్లు ఒకమాట చెప్పారు. మీ డిపార్టుమెంటు అంతా న్యాయం అని అనుకోము. మా వర్తక సంఘాలను గుర్తించి, మా వర్తక సంఘాలతరఫున బాధ్యులైనటువంటివాళ్ళను దగ్గరపెట్టుకొని సోదాచేయండి. మీ ఉద్యోగస్థులు అరెస్టుచేయకుండా హామీకూడా యివ్వాలి. అటువంటి దేమీ లేకుండా, మీ ఉద్యోగస్థులను నమ్ముకుని వాళ్ళ యిష్టంవచ్చినట్లు సోదాచేసి లెక్కల పుస్తకాలు తీసికొంటామని, కేసులు పెడతామని బెదరించి, ఇంకా కాస్త

ఎక్కువ మామూళ్ళో, నజరానాలో సంపాదించేదానికి మార్గం చూపించవద్దు అన్నారు. దీనిని ఏకగ్రీవంగా విచారణ కమిటీవారు అంగీకరించారు. ఆ సూచనలను ఏ మాత్రం అనుసరించారు ? చిన్న వర్తకుల, పేదప్రజల సహకారంతో వసూలు చేయగలిగినవాళ్ళ దగ్గరనుంచి వసూలు చేస్తామనే ప్రాతిపదికమీద అమ్మకం పన్ను విచారణకమిటీలో వర్తకులు, ఉద్యోగస్థులు అందరు కలిసి చేసిన సూచనలను బుట్టదాఖలా చేసిపారేసి, ఏ ఉద్యోగస్థుడంటే ఆ ఉద్యోగస్థుడు, ఎప్పుడంటే అప్పుడు వెళ్లి సోదాచేసి స్వాధీనం చేసుకొనే హక్కు ఇస్తూ ఆ బిల్లును ఎందుకు ప్యాస్ చేశారు ?

కమిటీ తరఫున బాధ్యత గలిగినవారు, ఉద్యోగస్థులు ఇచ్చిన హామీ లన్నింటినీ కూడ బుట్టదాఖలు చేసిన తరువాత ఏమని చెప్పగలం? ఈ చట్టం ప్రకారం ఎవరంటే వారు, ఎక్కడకుబడితే అక్కడకు వెళ్ళి సోదా చేయవచ్చు. మేజస్ట్రీటు దగ్గరనుంచి వారంటు తీసుకొనిపోయి సోదా చేయవచ్చు నన్నారు. మన దేశంలో దురదృష్టవశాత్తు విదేశస్థులిచ్చిన పోలీసు దృక్పథం, ఉద్యోగ దృక్పథం ఉన్నది. ఇది ఇంకా ఎంతకాల ముంటుంది అనుకొనే పరిస్థితులలో స్వాధీనం చేసుకొనే హక్కు ఉద్యోగస్థులకు ఇవ్వడం అంటే, "దారిన పోయే శనిగ్రహాన్ని ఇంట్లోకి రమ్మన్నట్టు"గా ఉంటుంది. వెనుక మేము చేసిన సూచన లన్నింటినీకూడ ప్రభుత్వం త్రోసిపారేశారు. మొన్న సెలక్టుకమిటీలో ఈ విషయం వచ్చినపుడు రూల్సులో చేస్తామని చెప్పారు. రూల్సులో చేసేటప్పుడు చట్టంలోనే ఎందుకు పెట్టకూడదు ? "క్రిమినల్

ప్రాసీజరుకోడ్‌కు వ్యతిరేకంకాని రీతిగా వారంట్ తీసుకొనిపోయి సోదా చేయవచ్చు" ననే వాక్యం పెట్టినప్పుడు, స్థానికంగా అక్కడి వర్తక సంఘాలలోని బాధ్యులుకూడ ఉండాలి అని చట్టంలో ఎందుకు పెట్టకూడదు? రూల్సులో పెడతామంటే మీకు నమ్మకంలేదా అంటున్నారు. అలా ఇదివరకు నమ్మినాము. విచారణ కమిటీలో మీ రిచ్చిన హామీలన్నీ బుట్టదాఖలుచేసి క్రిమినల్ ప్రాసీజరుకోడ్‌ను ప్యాస్‌చేసిన 6 నెలల తరువాత మళ్ళా సెలక్టు కమిటీలో దెబ్బలాడితే రూల్సులో చేస్తామని చెబితే నమ్మమంటారా?

ఆ హక్కు విషయమై వర్తక సంఘాలలో అసలు రెండు ఉద్దేశాలున్నాయి. వర్తకులను పెట్టే బాధలు తగ్గించడం ఒకటి ఉద్యోగస్తులమీద అజమాయిషీ ఉంచడం మరొకటి. వర్తకుల సహకారం లేకుండా కేవలం ఉద్యోగస్తుల శక్తితో, ప్రభుత్వంయొక్క దర్పంతో పన్నులు వసూలు చేయడం అసంభవంఅని ఋజువైంది. "నిర్బంధంగా వసూలు చేస్తామంటే – ఎట్లా వసూలు చేస్తారో మేమూ చూస్తా"మనే రీతిగా వారు పోటీపడుతున్నారు.

ఈ విషయమై భీమవరంలో చాలా సహకారం చేస్తున్నారని చాలమంది చెబుతారు. భీమవరంలోనివారు ప్రత్యేకంగా వచ్చారా! భీమవరంలోనివారు నిజంగా ఎక్కువ పన్నులు వసూలు చేస్తున్నారా? వర్తకుల దగ్గరనుంచి లోపలకు పోతే ఏమి వుంటుందో, మరి మీరూ వెళ్ళి చూడలేదు. మేమూ వెళ్ళలేదు. ఎక్కువ వర్తకం చేసే సెంటర్‌లో ఎక్కువ పన్నులుకూడ వసూలు అవుతాయి.

"ఈ వర్తక సంఘంలో పన్ను వసూలుకోసం ఎంతమంది పని చేస్తున్నార"ని మేము అడిగాం. ఆ వర్తక సంఘం తరఫున గుమాస్తాలుగాని, వాచర్లుగాని వచ్చిన ప్రతి బండినీ, ప్రతి లెక్కనూ తనిఖీ చేయడానికి భీమవరంలో 17 మంది వున్నారని చెప్పారు. డిపార్టుమెంటునుంచి అయిదుగురుకంటే ఎక్కువ లేరు. సంఘంలోనివారు ఇంటింటికీ తిరిగి తమ స్వంత పనిగా భావించుకొని, తమ మర్యాదను కాపాడుకొని, ఆదర్శంగా ఉండాలనుకొని ఈ కాంగ్రెసు ప్రభుత్వానికి తోడుపడదామనే ఉద్దేశ్యంతో 17 మంది పనిచేస్తుంటే, డిపార్టుమెంటువారు 5 మంది ఉద్యోగులను మాత్రమే ఉంచారు.

అట్లా న్యాయంగా పని చేయడానికి తయారైన ఉద్యోగస్తులు ప్రభుత్వానికి దొరికినప్పటికీకూడా 3 రెట్లు పెంచినట్లయితే ప్రభుత్వ డిపార్టుమెంటుకు ఎంత ఖర్చు అవుతుందో ఆలోచించండి. అటువంటివారు దొరుకుతారా అంటే ఆ విషయంలో ప్రభుత్వంవారికీ, ప్రభుత్వ డిపార్టుమెంటుకు కూడా నమ్మకం లేదు. వర్తకుల సహకారం లేనిదే పన్నులు వసూలుచేయడం సాధ్యంకాదు. ఎన్ని తనిఖీలైనా చేయండి, ఎన్ని తనిఖీ ఘాటీలు అయినా పెట్టుకోండి. సోదా అధికారాలు తీసుకోండి, జైలు అధికారాలు తీసుకోండి. ఏమి చేసినా కూడ వర్తకుల సహకారం లేనిదే పన్ను వసూలు చేయడం సాధ్యంకాదు. వర్తకసంఘాలు కావాలని మేము గట్టిగా నొక్కి చెప్పగా వర్తకసంఘాలమీద నేఆధారపడుతున్నామనీ, పన్నులు వసూలు చేస్తున్నామనీ చెప్పి, వారికి హామీ ఇవ్వడమనే సూత్రాన్ని ఈ ప్రభుత్వంవారు త్రోసిపారేశారు. ఇప్పటి

కైనా అంగీకరించాలి. సెలెక్టు కమిటీలో ఈ విషయం అంగీక రిస్తామని చెప్పారు.

పీనల్‌కోడ్ శిక్ష విషయం గురించి మేము విచారణ కమిటీలో అడిగినప్పుడు చాలా తర్జనభర్జనలు జరిగాయి. ప్రతిఉద్యోగిని అడిగాం. వర్తకులను అడిగాం. సామాన్య ప్రజలను అడిగాం. "తప్పుడు లెక్కలుపెట్టి పన్ను ఎగవేసే వారికి 2, 3, 4, 5 వేలు జరిమానా వేసినట్లయితే అతనికి 5 వేలుకాదు, 50 వేలు అయినా లెక్కకాదు. కట్టివేయగలడు. అందుచేత వారికి భయం లేకుండాపోతుంది. చట్టాన్ని ధిక్క రించే ధోరణి వస్తోంది" అన్నారు చాలామంది. కాని "మేము అటువంటివారం కాదు. అందువల్ల పీనల్‌కోడ్ శిక్ష ఒప్పు కోము" అని వర్తకులంతా వ్యతిరేకించారు. "మేము ఏమి తప్పు చేశామని ఈ పన్నులు వసూలుచేసే బాధ్యత మామీద పెట్టారు? ప్రజలనుంచి వసూలుచేసి ప్రభుత్వానికి ఇవ్వడానికి మేము జీతగాళ్ళమా? మాకు డబ్బు ఇస్తున్నారా?" వర్తకులు అడిగే ప్రశ్న లివి. ఇది ఏ రీతిగా నేరం అవుతుంది? "ప్రభుత్వం ఏమీ డబ్బు (ప్రతిఫలం) ఇవ్వకుండా ప్రజల దగ్గరనుంచి డబ్బు వసూలుచేసి ఇవ్వవలసిన బాధ్యత ఏమిటి మాకు? అవిశ్వాసం (Breach of Trust) క్రిందగాని, ఇంకో రీతిగా గాని తప్పుకాదా అంటే, అసలు పన్ను వసూలు చేయవల సిన బాధ్యత మామీద ఎందుకు ఉంది? మాకు ఏమైనా జీతం ఇస్తున్నారా? బత్తెం ఇస్తున్నారా? రాళ్లు ఇస్తున్నారా? రప్పలు ఇస్తున్నారా? మేము ఎందుకు వసూలుచేయాలి? డిపార్టుమెంటువారు తగిన సిబ్బందిని పెట్టుకోండి. అమ్మకపు

పన్ను వసూలుచేసుకోండి. మేము ఊరకనే ప్రభుత్వానికి పని చేస్తుంటే, అది కట్టలేదని, ఇది కట్టలేదని శిక్షలు వేయ డానికి తయారౌతున్నారు. దేశం అభివృద్ధికొరకు మేము వ్యాపారంలో వున్నాం కాబట్టి, ప్రజల సహకారం లేనిదే పనులు సక్రమంగా జరుగవు కాబట్టి మేము చేస్తున్నాం. అది మేము ప్రభుత్వానికి చేసే అదనపుపని, ఉపకారం, అద నపు సేవ. దానిని గుర్తించి మాకు కావలసిన సహకారం చేయకుండా, మేము డబ్బును కాజేయడమే ప్రధానంగా పెట్టు కొన్నామనే ఉద్దేశ్యంతో మా మీద శిక్షలు వేయడం ఏమి న్యాయం"అని వర్తకు లడుగుతున్నారు. ఉద్యోగస్తులలో చాలా అవినీతి ఉన్నదని కమ్యూనిస్టుల దృక్పథం. ఆ అవినీతి నూటికి 70 ఉన్నదో, 50 ఉందో, 30 ఉందో అంచనా చెప్పడం కష్టం.

తప్పుడు లెక్కలు పెట్టిన వారిని అందరినీ శిక్షించి నట్లయితే లాభంలేదు. సారాయి కేసులవలెనే అమ్మకపన్ను కేసుకూడా వస్తే ఉపయోగంలేదు. ప్రతి చిన్న వానిని జైలులోపెట్టి లాభంలేదు. 2, 10, 20 వేల రూపాయల పన్నును ఎగవేసే పెద్దమనుష్యులను - వారిని 40 వేలో, 50 వేలో కట్టమంటే కట్టివేస్తారు. 10 ఏండ్లకు ఒక పర్యాయం పట్టుకుంటారు. 10 ఏండ్ల లోపున మళ్ళా సంపాదించుకో వచ్చుననే ధైర్యంతో కట్టి పారేస్తారు. అటువంటి వారికి 6 నెలలో, 3 నెలలో శిక్ష ప్రధానం.

మంత్రి శ్రీ గోపాలరెడ్డి: పెద్దవారి మీదనా!

శ్రీ పి. సుందరయ్య: పెద్దవాళ్ళమీద అనే నేను చెప్పేది పెద్దవాళ్లను వదలి, వారిని రెండువేల రూపాయలు జరిమానా కట్టుకోవలసిందని చెప్పి, కిళ్ళీ దుకాణాల వాళ్ళను, ఉల్లిపాయల దుకాణాలవాళ్ళను 7,500 రూపాయల వరకు అమ్ముకునే వారిని జైళ్లకు పంపే పద్ధతిని కమ్యూనిస్టుపార్టీ ఒప్పుకోదు. ప్రజల దగ్గరనుంచి డబ్బు వసూలుచేసి విప రీతంగా లాభాలు సంపాదించి ప్రభుత్వానికి కట్టకుండా ఏ కొద్ది మందో ఉంటే వారికి నైతికంగాను, సాంఘికంగాను అది అవినీతి అని తెలియడానికి, ఇతర వర్తకులు అసహ్యించు కొనడానికి మార్గంగాకూడా ఈ జైలుశిక్ష ఉంటుందని మేము సూచించాం. ఎక్కువమంది వర్తకులు అవినీతిపరులు కారని, ఎక్కువమంది నీతిపరులే అని, ప్రభుత్వానికి సహకారం చేయాలన్న ఉద్దేశం గలవారే అని మేము భావించాము. ఎవరో కొద్దిమంది మాత్రం తమ స్వలాభంకోసం అనేక రీతులుగా డబ్బు కాజేయడానికి చూస్తుంటే, వారికి నీతి చెప్ప డానికి ఇతర వర్తకుల సహకారం, ఇతర ప్రజల సహ కారంకూడా తీసుకోడానికి, అటువంటివారిపై మాత్రమే శిక్ష విధించడానికి మేము అంగీకరించాం. దానికైనా ఎన్నో నిబంధనలు పెట్టాం.

మొదటిదఫా తప్పుడు లెక్కలు వ్రాసినట్లుంటే మామూలు అపరాధమే విధించాలి; జైలు శిక్ష లేదు. రెండవ దఫా తప్పుడు లెక్కలు వ్రాస్తే కోర్టులోపెట్టి ఋజువుచేసి శిక్ష వేయాలని చెప్పాం. అటువంటి పరిస్థితులలో శిక్ష తప్ప అపరాధంలేదు. పెద్దవారిని నలుగురిని పట్టుకుని జైళ్ళలోవేస్తే

చిన్నవాళ్ళుకూడా ఇది తప్పని తెలుసుకుంటారు. పెద్దవాళ్ళు చేస్తున్నారు. కాబట్టి మనం చేస్తే తప్పు ఏమిటి? అని అనుకోకుండా పెద్దవారిని నలుగురిని పట్టుకుని ఆ విధంగా చేయగలిగితే ఆదర్శప్రాయంగా ఉంటుందనే మేము చెప్పాం. అమ్మకంపన్ను చట్టంలోని ఏరూల్సును ఎవరు ధిక్కరించినా ఆరు నెలలు శిక్ష వేయవచ్చును; రెండువేల రూపాయలు జరిమానా వేయవచ్చునని ఎ,బి,సి,డి,ఇ,యఫ్,జి అంటూ క్లాజులు ముసాయిదాబిల్లులో పెట్టారు. ఎందుకు పెట్టారంటే వెనుకటి ఆంధ్ర సవరణచట్టంలో ఉన్నదికాబట్టి పెట్టాం అన్నారు. ఆంధ్ర అమ్మకం పన్ను విచారణసంఘంవారు నాలుగు నెలలు ప్రభుత్వం డబ్బుతో తిరిగి తిరిగి రిపోర్టువ్రాశారు. వారు ఏకగ్రీవంగా చేసిన ప్రతి నిర్ణయాన్ని త్రోసిపారవేసి, ప్రతిదానికి శిక్ష వేయడానికి చట్టంలో వున్నదానిని ఉన్నట్లు ఇక్కడ పెట్టారు. ఈ గొడవ అంతా మేము చెబితే కొన్ని మార్పులు చేశారు. ఏమిటి ఆ మార్పులు? శిక్ష వేయడమనే దానిలో మార్పులేదు. క్లాజులు బి, డి, ఇ, యఫ్, విషయంలో మాత్రం శిక్ష ఉంటుంది; మిగిలినవాటికి లేకుండా తీసివేశారు. క్లాజులు ఎ, సి, జి లకు జరిమానా మాత్రమే ఉంటుంది. ఉద్యోగస్థులు తప్పుడు లెక్కలుకట్టి కావాలని ఉద్దేశపూర్వకంగా ప్రభుత్వానికి పన్ను ఎగవేయాలని చూస్తున్నారని శిక్ష వేయించవచ్చును. ఉద్యోగస్థులు సోదా చేయడానికి కాని, పుస్తకాలుస్వాధీనంచేసుకోడానికికాని వెళ్ళినపుడు అడ్డువస్తే అప్పుడుకూడా శిక్ష వేయించవచ్చును. వీటికి తప్ప మిగిలినవాటికి శిక్షలేదని చెప్పారు. సెలక్టు కమిటీలో ఈ

క్లాజుల విషయమై కొంత మార్పు చేసినతరువాత కూడా ఏమి ఉన్నది? తప్పుడు లెక్కలు వ్రాస్తున్నారనే పేరుతో ప్రతి చిన్నవానిమీదకు కూడా వెళ్లవచ్చును. నిజానికి శిక్ష వేయడం ప్రధానంకాదు. వర్తకుల సహకారం తీసుకోడం ప్రధానం. ఇటువంటి సహకారం రాకుండా చేస్తున్నారు. (లక్షల, కోట్ల రూపాయలు వ్యాపారం చేసేవారు కొంతమంది ఉద్యోగస్థులను లోబరుచుకుని) వారికి పాఠం చెబితే మిగిలిన వారు సక్రమంగా ఉంటారు. చిన్న వర్తకులు సహకారం చేస్తారనే పునాదిమీద మేము వెడితే, అందరిమీద శిక్ష వేస్తామనే రీతిగా చట్టం తయారైనది.

అమ్మకం పన్ను విచారణ సంఘంవారు యీ క్లాజుల క్రింద ప్రోసిక్యూషన్ చేసే అధికారం కమిషన్‌కు మాత్రమే ఉండాలన్నారు. కాని యీ సూచనను కూడా త్రోసిపారవేసినారు. ఈ విషయమై సెలక్టు కమిటీలో వాదించిన తరువాత కూడా శిక్షల క్లాజులు చాలా విస్తృతంగా ఉన్నాయి. అందరి మీద శిక్షలు వేయవచ్చును. అభ్యంతరం గలిగిస్తే శిక్ష వేయించవచ్చును. అభ్యంతరం అంటే ఏమిటి? 'ఉండవయ్యా, మా వాళ్లు కొంచెం మడి కట్టుకుంటున్నారు; కొంచెం ఆగు' అంటే అడ్డగింపు అవుతుంది. నావి న్యాయమైన లెక్కలు; ఎందుకు తీసుకువెళ్ళుతున్నావు అంటే అడ్డగింపు అవుతుంది. ప్రపంచం ఎంత విస్తృతంగా ఉన్నదో అడ్డగింపు అంటే అన్ని విశాలమైన అర్థాలు తీయవచ్చును.

అతనివల్ల రావలసిన ఫీజుగాని, పెనాల్టీగాని, పన్ను గాని నిర్ణయింపబడిన కాలంలో రానిచో...అని ఒక క్లాజు

పెట్టారు. దీని క్రింద అన్నిరకాల వారిని శిక్షించవచ్చును. రిజిస్ట్రేషన్ ఫీజుకాని, అపరాధంకాని, పన్ను కాని ఏది చెల్లించక పోయినా శిక్షించవచ్చును. శిక్ష వేయడమే ప్రధానంగా కనిపిస్తోంది. 'లేదా జుల్మానా' అంటూ ఒక విచక్షణా పూర్వక నిబంధన పెట్టారు అంటే మేజిస్ట్రేటు చిన్న వారికి జైలుశిక్ష వేసి పెద్దవాళ్ళపై అపరాధం వేయవచ్చును. అధికారికి ఈ రకమైన స్వాతంత్ర్యం యెందుకు యిచ్చారు ? జైలు శిక్ష అనేది ప్రత్యేక పరిస్థితుల్లో అవినీతిపరులైనవారికి బుద్ధిచెప్పడానికి, వర్తకులు, ప్రజలు కూడా అసహ్యించుకొనడానికి వీలుగా ఉండాలనే సూత్రాన్ని త్రోసివేసి, అందరూ తప్పుచేసేవాళ్లే, అందరినీ ఒకేరకంగా చూడాలనే ధోరణి ఇందులో కనిపిస్తోంది. ఉన్న నేరాలు, ఉన్న శిక్షలు చాలక ఇంకా కొత్తనేరాలు తయారుచేయడానికి మేము సిద్ధంగా లేము. ప్రొహిబిషన్ కేసులతో ఇప్పటికే జైళ్ళన్నీ నింపాం. ఇప్పుడు అమ్మకం పన్ను నేరాలు అంటూ కొత్త నేరాలను తయారుచేసి జైళ్లు నింపడానికి తయారుగా లేము.

అమ్మకం పన్ను విచారణ సంఘంవారి ముందు కమీషనర్ యీ నేరాల క్రింద ప్రోసిక్యూషన్ నడపాలని మేము సూచించడంలో ఉద్దేశం ఏమిటి ? అతడు పెద్ద అధికారి; ఏ నలుగురైదుగురు పెద్దవారినో ప్రోసిక్యూట్ చేయించక చిన్న చిన్న కేసులన్నింటికి ప్రాసిక్యూషన్ చేయిస్తాడని మా ఉద్దేశం. 1956 లో వచ్చిన సవరణ చట్టంలో దీనిని బుట్టదాఖలు చేశారు. ఈసారి సెలక్టు కమిటీలో దెబ్బలాడితే ఆఖరుకు కమిషనర్ బదులు కమ్మర్షియల్‌టాక్సు ఆఫీసరని పెట్టినారు.

ఇతనెక్కడ? అతనెక్కడ? జిల్లాకు ఒకరో యిద్దరో కమ్మర్షియల్ టాక్సు ఆఫీసర్లు ఉంటే, వారికి యీ ప్రాసిక్యూషన్ నడిపే అధికారం యిస్తారన్నమాట. అమ్మకం పన్ను విచారణ సంఘంవారు చెప్పిన సూత్రాలకు, అభిప్రాయాలకు పూర్తిగా భిన్నంగా ఉన్నది యిదంతా. వర్తకుల సహకారం, ప్రజల సహకారం మాకు అవసరం లేదు; మా సిబ్బంది మాకు ఉన్నారు; వారికి ఎక్కువ అధికారాలు యిస్తే మేము యింకా ఎక్కువ వసూలు చేయగలం; అందుచేత ఆఫీసర్లకు ఎక్కువ అధికారాలు ఇస్తాం; చిన్న "వర్తకులమీద పెద్ద వర్తకుల మీద ప్రాసిక్యూషన్ నడుపుతాం" అనే ధోరణిలో ఉన్నది ఈ బిల్లు అంతా. అందరూ ఒకటే, అందరిమీద శిక్షలు వేస్తాం అనే రీతిని దండన షరతులు పెట్టడం కొత్త నేరాలను తయారు చేయడానికీ, ఉద్యోగులు వర్తకులను మరికొంత అల్లరిచెయ్యడానికీ వీలు కల్పించడం తప్ప మరొకటి కాదు. ఎవరో కొద్దిమంది అవినీతి పరులను శిక్షించి-అదైనా రెండవ పర్యాయం అయితేనే-ఒక ఆదర్శంగా ఉండడానికి దండన షరతు పెడితే తప్ప, ఈ రకంగా ఉన్నప్పుడు మేము వ్యతిరేకించవలసియున్నది; మేము సవరణలు ఇవ్వవలసి ఉంటుంది.

## క్యాజువల్ డీలరు, హాకరు, బ్రోకరు

తరువాత నిర్వచనములలో క్యాజువల్ డీలరు అని వున్నది. ఇతనిమీద యింతవరకూ పన్ను లేదు. ఇప్పుడు కొత్తగా తెలంగాణాలో వుందని చెప్పారు. తెలంగాణాలో ప్రజలకు వ్యతిరేకమైనవి, ఆంధ్రలో ప్రజలకు వ్యతిరేకమయి

నవి పొందుపరచడంలో డిపార్టుమెంటుయొక్క గొప్పతనం, మంత్రివర్గం యొక్క గొప్పతనం......

మంత్రి శ్రీ గోపాలరెడ్డి: అదయినా చేశారుకదా?

శ్రీ పి. సుందరయ్య: అది చేశారని మీరు సంతోషిస్తున్నారు. మేము విచారిస్తున్నాం. కాజువల్ డీలర్ కొక నిర్వచనం యిచ్చారు. హాకర్‌ను కాజువల్ డీలర్ క్రిందకు తీసుకువచ్చి కొంప ముంచవద్దని చెబితే, ఆలోచిస్తాం అన్నారు. ఏమి ఆలోచించారో సెలెక్టుకమిటీ నివేదికలో ఎక్కడా కనపడలేదు. ఏ రూల్సుక్రిందికి వస్తుందో కనపడ లేదు. కా. డీ. గురించి చిత్తుబిల్లులో ఎట్లావుందో యిప్పుడూ అట్లానే వున్నది. ఎవరంటే వాళ్లపైన పన్ను వేయడానికి వీలుంటుంది. రెండువందలు రూపాయల వస్తువులను అమ్ముకునేవాడుకూడా పన్ను కట్టాల్సి వస్తుంది. ఈ కా. డీ. కి లిమిట్ పెట్టడం అవసరం. హాకర్ అయితే కా. డీ. క్రిందకు రాడు, కాజువల్ డీలర్ అయితే హాకర్ క్రిందకు రాడు అని వుండాలి. సీతాఫలాలు బండ్లలో తెచ్చి అమ్ముతారు. వాటి పైన 200 లేక 300 రూపాయలకంటే రాదు. ఈ మూడు వందల రూపాయల అమ్మకమునకు పన్ను వేయాల్సినదేనా?

మామూలు హాకర్సు, బ్రోకర్సు దీని క్రిందకు రారని సవరణ చేయాలి. అది చేయకపోతే కాజువల్ డీలర్ వల్ల ప్రభుత్వానికి ఎక్కువ ఆదాయము రాదుగాని, ప్రభుత్వోద్యోగులు వారినిపీడించి డబ్బు సంపాదించడానికిమాత్రం బాగావుపయోగ పడుతుంది. వారు కొంత డబ్బు కడితే కడతారు. లేకపోతే లేదు. ఈ పన్నులనే చేపలను పట్టడానికి విస్తృతంగా వలవేసి

మాటలకు దీర్ఘ నిర్వచనాలిచ్చి, కోసవరకూ లాగితే యీ వల చిరిగిపోయి చాలామంది తప్పుకుపోవడానికి ఉపయోగ పడుతుంది. అందుచేత యీ విషయంలో చాలా మార్పులు చేయవలసివుంటుంది. అసలు సూత్రాలే తప్పు సూత్రాలు. ఆ సూత్రాలలో కూడా సామాన్య ప్రజలకు, చిన్న చిన్న వర్తకులకు నష్టం రాకుండా ప్రభుత్వం చేయాలి. దానికోసం సింగిల్ పాయింట్ మొదటి కొనుగోలు, అమ్మకం పన్నుల మీద పెద్ద వర్తకులనుండి ఖచ్చితంగా పన్నువసూలు చేయ డానికి అధికారాలు మేము యిస్తాం అన్నాం; ఎందుకంటే, వాళ్ళకు దెబ్బలాడేశక్తి వుంది కనుక. కాని నోరులేని సామాన్య వర్తకులమీద ఈ రకంగా పన్నులువేసే అధికారం యివ్వ లేమని పదే పదే చెప్పినాము. కమ్యూనిస్టులు చెప్పారు కదా, ప్రతిపక్షాలవారిపని తిట్టడమేనని ఉపేక్షించరాదు. 'వర్తకులు తప్పించుకోడానికి ఎన్నో మాటలు చెబుతారు. వాళ్ళ మాటలకు విలువేముంది, మేమే సర్వజ్ఞులం,' అనే ధోరణిలో పోవడం సరియైన పద్ధతికాదు. సెలక్టు కమి టీలో ప్రతిపక్షాల తరఫున ఒకరిని వేసినప్పటికీ - ఒకరి నైనా వేసినందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను - ఎందుకని అంగీకరించాం? ఈ బిల్లునంతా పూర్తిగా మార్చివేయగలమని మేము అంగీకరించామా! లేదు. ప్రభుత్వ ఆదాయం తగ్గకుండా, సామాన్య వర్తకులకు నష్టంలేనిరీతిగా సూచనలు చేయడానికి సహకరించాలని మేము కమిటీలో సభ్యత్వాన్ని అంగీకరించాం. నా ఆరోగ్యం బాగులేకపోయినా ప్రతి మీటింగ్‌లో చర్చించి వర్తకుల

ప్రతినిధులు, డిపార్టుమెంటు ప్రతినిధులు, కాంగ్రెస్ ప్రతినిధులు అందరూ ఏకగ్రీవంగా అంగీకరించిన సూచనలే చేశాం. వాటినైనా ఆలోచించండి. ఈ బిల్లును మా కమ్యూనిస్టు దృక్పథంలోకి మార్చాలనే ఉద్దేశ్యం లేదు. మేమిచ్చిన మంచి సూచనలన్నీ బుట్టదాఖలు చేసి, మేమే సర్వజ్ఞులమని భావిస్తూ, పన్నులు ఎక్కువచేయాలి సహాకరించండి అని చెప్పకండి. సహకారానికి కూడా కొంత పరిమితి వున్నదని గుర్తుంచుకోండి. చిన్న వర్తకులను వేపించుకొనితినడానికి ప్రభుత్వం చట్టాలు తెస్తుంటే, దానికి చేసే సహకారం ప్రజలకు అపకారం అవుతుంది. అందుచేత యింతగా టైము తీసుకొని నిర్మొగమాటంగా చెప్పవలసి వచ్చింది. ప్రభుత్వ ఆదాయానికి నష్టంరాకుండా చిన్న వర్తకులు, కాంగ్రెసు ప్రతినిధులు చేసిన సూచనలనైనా మనస్సులో పెట్టుకోకుండా త్రోసివేస్తే యిది నిరుపయోగమవుతుంది.

# బిల్లులోని క్లాజులవిూద సవరణలు

(పి. డి. ఎఫ్ - కమ్యూనిస్టుపక్షంచే ప్రతిపాదింపబడ్డవి)

2 వ క్లాజు - నిర్వచనాలు : ఇందులో (సి) కాజుయల్ డీలర్ అనే వర్గమే తీసివేయమన్న సవరణను చాలా చర్చించి వోట్లు తీసుకుంటే, తీసివేయమన్నవారు 43, వుంచమన్నవారు 97. సవరణ వీగిపోయింది.

రెండవసవరణ : "కాజువల్ డీలర్ అనగా హాకర్ కానివాడు, మరియు ఒకేదఫా రు 500 మించి టర్నోవరు చేసిన వాడు" అని చేర్చమనగా ఇదిగూడ వీగిపోయింది.

సోదా చేయడానికి వంట ఇంటిలోకి, పూజాగృహం లోకి దూరే లేక తలుపులు బద్దలుకొట్టే అధికారాలు ఆఫీసర్లకివ్వడం వాంఛనీయంకాదు. గనక వ్యాపారస్థలము (కె) నిర్వచనంలో దుకాణము ఆఫీసు గోడౌన్ వుంచి, లెక్కలుంచే స్థలము అన్నమాటలను తీసివేయమని సవరణ తేబడింది. వోటుతీసుకోగా సవరణకు అనుకూలురు 45, ప్రతికూలురు 87, తటస్థులు 1. వీగిపోయింది.

3 వ క్లాజు : అప్పిలేట్ ట్రిబ్యునల్లో 3 వ మెంబరు చార్టర్డు ఎకౌంటెంటు వుండాలనే సవరణ వీగిపోయింది.

5 వ క్లాజు : కనీస టర్నోవరు రు 7500/- బదులు రు 20,000 ఉండాలని ఒక సవరణ, పన్నుకట్టవలసిన టర్నోవరు రు 10,000 లకు తక్కువగాకుండా వుండాలని మరొక సవరణ తేబడ్డాయి. మంత్రిగారు రెంటికీ అంగీకరించలేదుగాని కనీస టర్నోవరు రు 7500/- కి బదులు రు 10,000 కి అంగీకరించి, రిజస్ట్రేషన్‌ఫీజు మాత్రం సెలెక్టు కమిటీలో ప్రభుత్వం మూడురూపాయిలకే ఒప్పుకొని యిపుడు మరల ఆరురూపాయిలకు పెంచేరు...కనీస టర్నోవరు రు 20,000 వుండాలనే సవరణపై వోటుతీసుకోగా అనుకూలురు 39, వ్యతిరేకులు 91. వీగిపోయింది.

తరువాత కనీస టర్నోవరు రూ. 10,000 ప్రభుత్వం అంగీకరించింది గనుక మూడవ సవరణ అంగీకరించబడింది.

ఈ సెక్షన్‌లో సాధారణ అమ్మకపు పన్ను నూటికి 2 నయాపైసలకు బదులు 1 నయాపైస వుండాలని సవరణ తెచ్చి దశాంశపద్ధతి నాణెములు కేంద్ర ప్రభుత్వం తేవడం రాష్ట్ర ప్రభుత్వాల కెక్కువ డబ్బు రావడానికి గాదని, నయాపైసల జంత్రితో తంత్రం చేయవద్దని గట్టిగా చెప్పబడింది. మంత్రి అంగీకరించలేదు. వోటు తీసుకోగా అనుకూలురు 41, వ్యతిరేకులు 82, తటస్థం 1. తరువాత $1\frac{1}{2}$ నయాపైసకు వోటు తీసుకోగా అనుకూలురు 36, వ్యతిరేకులు 79, తటస్థులు 1. రెండూ వీగిపోయేయి. తరువాత $1\frac{9}{16}\%$ అనే సవరణ తేగా అదీ వోడిపోయింది. హోటల్సుకు 3% బదులు $2\frac{1}{2}\%$ అనే సవరణగూడా వీగిపోయింది.

12 వ క్లాజు : సాలుకు రు. 5000 తక్కువగాని టర్నో వరు గల డీలరు యీ చట్టంక్రింద రిజష్టరు చేయించుకోవాలనేదానికి బదులు రు. 7500 తక్కువ కానివారే చేయించుకోవాలని...రిజస్ట్రేషన్ రద్దుపర్చుకోడానికి వరుసగా రెండేళ్ళు రు. 5000 లోపు టర్నోవరుండాలనే దానికి బదులు వరుసగా రు. 7500 లో వుండాలని...సవరణ తేబడింది.

దీనిని మంత్రి అంగీకరించలేదు. కాని సవరణ ప్యాసైంది.

వెంటనే మంత్రిలేచి రిజస్ట్రేషన్ ఫీజు రు. 3 నుండి రు. 6 లకు పెంచాలని సవరణ తెచ్చేరు. సెలెక్టు కమిటీలో రు. 3 అంగీకరించి ప్రభుత్వం యిపుడు పెంచడాన్ని ప్రతిపక్షం తీవ్రంగా విమర్శించింది. కాని చివరకు రు 6 ఖాయమైంది.

21 వ క్లాజు : అప్పిలేట్ ట్రిబ్యునల్‌కు చేసుకొనే అప్పీలుకు రు. 100 మించని ఫీజు అనేదానికి బదులు, రూ. 10 గాని నూటికి ఒకరూపాయిగాని ఏది ఎక్కువైతే అది ఫీజుగా నిర్ణయించాలని సవరణ తేబడింది. చిన్నవాళ్ళకు రు. 10 అందుబాటులో వుంటుంది. పెద్దవాళ్ళవద్ద కేసు ఎంత పెద్దదైతే అంత హెచ్చు మొత్తం తీసుకోవడంవల్ల ప్రభుత్వానికి కలిసివస్తుంది. మంత్రిగారు సమాధానం చెపుతూ సిద్ధాంతం బాగానే వున్నదిగాని ట్రిబ్యునల్ ధనం సంపాదించే సంస్థగాదు గనక సవరణ అంగీకరించ వీలులేదన్నారు. వీగిపోయింది.

తరువాత - హైకోర్టుకు వెళ్ళిన కేసులలో ఆ తీర్పు వచ్చేలోగా తాత్కాలికంగా 'ఇంటెరిం రిలీఫ్' ట్రిబ్యునల్

యివ్వవచ్చుననే సవరణ తేబడింది. మంత్రి అంగీకరించ లేదు. లిటిగేషనంతా తేలిన తరువాత పన్ను చెల్లించ వచ్చునులే అనే వుద్దేశముతో కొన్ని అప్పీళ్లు పడుతుంటా యట. ఈ తత్వాన్ని ప్రోత్సహించడం మంచిదిగాదన్నారు. అవసరమని తోస్తే హైకోర్టువారే స్టే యిస్తారన్నారు. సవరణ వీగిపోయింది.

28 వ క్లాజు : అధికారికి అనుమానం కలిగినపుడు లెక్కలు స్వాధీన పర్చుకోవచ్చునని, చొరబడవచ్చునని, సోదాచేయవచ్చునని, తలుపులు, పెట్టెలు బద్దలుకొట్టవచ్చు నని సరుకులను ప్రభుత్వపరం చేసివేయవచ్చునని వున్న నాలుగుసబ్ క్లాజులు తీసివేయుమని సవరణ తేబడింది. వర్తకు లంతా నేరస్థులనే ధోరణిలోవున్న యీ క్లాజును మొత్తంగా తీసేసి కొత్తగా వ్రాయమన్నారు. ఇండియాలో రు. 575 కోట్ల మీద రావలసిన సుమారు రు. 250 కోట్ల ఇన్కం టాక్సు ఎగవేయబడుతూ వుందని అంచనా కట్టేరు. పెద్ద వ్యాపారస్థులకు రక్షణ అన్ని రంగాలనుండి వస్తూంది. చిన్న వాళ్ళకు కావలసిన రక్షణల్ని గురించి జాగ్రత్త వహిం చాలి... సెంట్రల్ ఎక్సైజ్ వారుగూడా సోదాకు వచ్చి నపుడు వర్తకుడు లేకపోతే అతనికి నోటీసిచ్చే వరకు తలుపు లకు సీళ్ళువేస్తారేగాని బద్దలు కొట్టరు. సెలెక్టు కమిటీలో యీ క్లాజును చర్చించి వర్తక సంఘ కార్యవర్గ సభ్యుని దగ్గర పెట్టుకొని సోదాచేయమని సిఫారస్ చేయబడింది. కావలిస్తే రిజిస్టర్డు వర్తకులంతా సంఘంగా ఏర్పడాలని నిబంధన చేయవచ్చు. వర్తకు లెగవేతకోసం అన్యాయం చేస్తుంటే

ఉద్యోగులు లంచాలకోసం అన్యాయం చేస్తున్నారు. మీరంతా సత్ప్రవర్తకులా అని అడిగితే కాము అని ఉద్యోగులే అంటున్నారు. ఈ విషయం మంత్రులుగూడ అంగీకరించినదే... సోదాకు వారంటు కావాలని ఉద్యోగి అడిగితే ఉద్యోగితప్పో వర్తకునితప్పో విచారించే।అవకాశం క్రి॥ ప్రొ॥ కోడ్‌లో లేదు. వారంటుఇచ్చి తీరవలసిందే ...।సాక్ష్యం కోసం పోలీసులు ఎవరినో తీసుకువస్తారు. పోలీసులు తీసుకువచ్చే పెద్దమనుష్యుల్ని గురించి అందరికి తెలుసును. ఆఫీసరు అధికారాన్ని దుర్వినియోగం చేసినా, సోదాలో దుర్భాషలు మొదలు ఇంకా యితరములయిన అన్యాయాలు చేసినా వాటిపై చెకప్‌కోసం వర్తక సంఘపు మనిషి వుండాలంటున్నాము. ఈ ప్రమాదకర విషయాన్ని రూల్సులో ఆలోచిద్దాములే అని త్రోసివేయగూడదు. చట్టంలోనే నిర్దిష్టంగా వ్రాయాలి అని ప్రతిపక్షం వాదించింది.

మంత్రి వ్యతిరేకిస్తూ యీ విధంగా అన్నారు: "అన్ని చోట్ల వర్తకసంఘాలు లేవు. మారుమూలల యీ అధికారం చెలాయించవలసి వస్తుందనుకోండి. అపుడేమి చేయమంటారు? ఒకవేళ వర్తకులున్నా - రారు. వస్తామన్నా - కాఫీ తెండి, కారు తెండి అంటారు. అన్నీ యిచ్చినా కేసు పూర్తిఅయ్యే లోపల సాక్ష్యం తిరిగిపోయే ప్రమాదం వుండనేవుంది. అంచేత చట్టం యిలాగే వుండాలి.

మొత్తం మీద యీ క్లాజు అన్నిటికన్న ఎక్కువ వాదోపవాదాలకు గురిఅయింది. మీరు చెప్పిన విషయాలన్నీ దృష్టిలో పెట్టుకొని ఆఫీసర్లకు వేరే సలహాలు పంపుతాము -

అని సవరణలను తిరస్కరించేరు. ఓటింగ్‌లో సవరణ కనుకూలురు 37, వ్యతిరేకులు 82. వీగిపోయింది.

30 వ క్లాజు (3) : "అసలు రిటరనే పంపకపోవడం గాని" అనే మాటలను "ఉద్దేశపూర్వకంగా రిటరన్ పంపక పోవడంగాని" అన్నట్టు మార్చమని సవరణ తేబడింది. మామూలుగా రిటరన్ పంపకపోడానికీ ఉద్దేశపూర్వకంగా తప్పుడు రిటరన్ పంపినదానికి ఒకేశిక్ష న్యాయంగాదు. ఈ విషయాన్ని సెలెక్టు కమిటీలో అంగీకరించింది ప్రభుత్వం. కాని యిపుడు మంత్రి చెప్పేదేమంటే రిటరన్ పంపకపోవడం అనే మాటలకు ముందు ఉద్దేశపూర్వకంగా అనే పదాన్ని చేర్చడం లా డిపార్టుమెంటువారు సాధ్యపడదంటున్నారట. పోనీ ఈ రెంటిని విడదీసి వేరువేరు సబ్‌క్లాజులలో పెట్టమన్నా ఒప్పుకోలేదు. 2 ఏళ్ళదాకా శిక్ష అన్నప్పుడు కేసు స్వభావాన్నిబట్టి ఒక నెలే వేయవచ్చు. కాబట్టి సవరణ అంగీకరించలేదు. వోటు తీసుకోగా సవరణకు అనుకూలురు 45, వ్యతిరేకులు 75. వీగిపోయింది.

తరువాత తనిఖీకి సోదాకు వచ్చినవారిని నిరోధించినా ఆపుచేసినా (అబ్‌స్ట్రిక్షన్) అనే పదాలలో ఆపుచేసినా అనే పదాన్ని తీసేయమని సవరణ తేబడింది. పదినిమిషాలు ఆగ వయ్యా అన్నా, మర్యాదస్తు లెవరినన్నా సాక్ష్యానికి తీసుకు వచ్చేదాకా ఆగవయ్యా అన్నా ఆపుచేసినాడనే నేరంమోపి 6 నెలలు ఖైదు వేయవచ్చును. ఇంత విస్తృతాధికారం ఆఫీసరుకివ్వడం మంచిదిగాదు... ఈ సవరణను మంత్రి అంగీకరించలేదు. వీగిపోయింది.

పోనీ, "జబర్ దస్తీగా" ఆపుచేసినా అని సవరించ మన్నాము. దానికీ ఒప్పుకోలేదు. ఈ సవరణగూడ ఓడి పోయింది.

పన్నునుండి తప్పించుకున్నా లేక ఫీజునుండి తప్పించు కున్నా ఆరునెలలు ఖైదు లేక రు 2000 జరిమానా విధించ బడుననే దానినుండి "ఫీజునుండి తప్పించుకున్నా" అనే మాటలు తీసివేయమని మరొక సవరణ తేబడింది. రిజిస్ట్రేషన్ ఫీజు రు 6. దీన్ని ఎగవేసినా అంతపెద్ద శిక్షేనా! ఫీజు అనగా పన్నుగాదు గదా ! దీన్ని ఒక కాంగ్రెస్ సభ్యుడు బలపరుస్తూ ఫీజుగురించి సెలెక్టు కమిటీలో ఆలోచించినట్లే వుంది. 6 నెలలుశిక్ష ఈ ఫీజుగురించి ఎక్కడాలేదే! ప్రభుత్వం యీ సవరణను అంగీక రించడమే మంచిదన్నారు. మరొక కాంగ్రెసు సభ్యుడు లేచి "చిన్న నేరం, పెద్దనేరం, ఘోరమైననేరం అంతా కలగా పులగంచేసిన క్లాజిది"అన్నారు. అమ్మకపుపన్ను చట్టంరీత్యా మద్రాస్‌లో జరిమానాలు వేసుకున్నాము, కర్నూలులో జైలుశిక్షలు వేసుకున్నాము, హైద్రాబాద్‌లో వురిశిక్షలు వేసుకొందాము అన్నారు. ప్రభుత్వం నిదానించి యీ చిన్న సవరణనైనా ప్రతిపక్షంవారిది ఒప్పుకోకపోతే వర్తకలోకం చాలా బాధపడుతుందన్నారు. మంత్రిగారు సమాధానమిస్తూ బ్రహ్మాస్త్రంమాత్రం వుండడం మంచి దన్నారు. దాన్ని ప్రతి పిచ్చుకమీద వాడక పోయినా, చిన్న వర్తకులను బాధపెట్టడానికేది పెడుతున్నామని అనుకోరాదు. ఎగవేతలు నిరోధించడానికి యిది ఉద్దేశింపబడింది. ఈ వజ్రాయుధాన్ని చూపిస్తే భయమైనావుంటుంది. కనుక సవరణ అంగీకరించ మన్నారు. వీగిపోయింది.

తరువాత యీ క్లాజులో జరిమానా రూ. 2000 వరకు అనేదానికి బదులు ఈ దిగువవాటికి రూ. 200 వరకు అని వుండాలని సవరణ తేబడింది: డీలరుగా రిజిష్టరు చేయించుకో తగినవాడు చేయించుకోకపోయినా, గడువులోపల ఫీజు పన్ను పెనాల్టీ కట్టకపోయినా, చట్టానికి రూల్సుకు ఉద్దేశపూర్వకంగా వ్యతిరేకంచేసినా, ఈ 3 నేరాలకు రు 200 జరిమానా చాలునని చెప్పేను. రు. 200 వరకు అన్నపుడు మేజస్ట్రేట్ చిన్న నేరమైతే రు. 10 వేస్తాడుగదా అతన్ని ఎందుకు నమ్మగూడదు అనడం సరిగాదు. నేరం తరగతులను నిర్వచించడం, ఏ తరగతి కెంతశిక్షో నిర్ణయించడం శాసనసభపని. శాసన సభలోని వాళ్ళకేమీ తెలియదు గనక విస్తృతంగా అధికారాలన్నిటిని ఆఫీసర్లకే యివ్వడం మంచిదనేవైఖరి హాస్యాస్పదం.

దీనికి మంత్రి అంగీకరించలేదు. మేజస్ట్రేట్లు ప్రభుత్వం క్రిందలేరు. స్వతంత్రంగానే ఆలోచిస్తారు. మేజస్ట్రేట్లు మొదలు ఆఫీసర్లంతా లంచగొండులనుకోడం పొరబాటు అన్నారు. సవరణ వీగిపోయింది.

పిమ్మట "బండిలోగాని, బోటులోగాని, ఇంటిలోగాని తనిఖీని సోదాను ఆపుచేస్తే 6 నెలలు శిక్ష లేక 2000 రూ. జరిమానా లేక రెండూ విధించవచ్చు"ననేది తీసివేసి యీ నేరాలకు రు. 200 జరిమానా అని మాత్రమే వుండాలని సవరణ ప్రతిపాదింపబడింది...చెక్ పోస్టులవద్ద జరిగే అన్యాయాల్లో ఒకటి ఉదాహరణగా చెప్పేరు. ఒక సబ్ ఇన్స్పెక్టరు కొబ్బరికాయల లారీని ఆపినాడు. అతని తాబేదారు డ్రైవరును

ఇన్స్పెక్టరుకోసం కాయ లిమ్మని అడిగేడు. లారీలో నిద్ర పోతున్నవారిని డ్రైవరు లేపి అధికార్లు కాయ లడుగుతున్నారు సార్ అన్నాడు. సుందరయ్య అనే యం.యల్.ఏ. వీలు లేదని చెప్పమన్నారని అలా రికార్డు చేసుకోమని చెప్పవలసివచ్చింది.

మంత్రి: ఏ నెలలో?

సుందరయ్యగారు: ఏప్రిల్ నెలలో.

మంత్రి: ఎండాకాలం గనక ఇన్స్పెక్టరు ఒంకాయ కావాలంటే ఇంత బ్రహ్మాండంచేస్తే ఎట్లా?

సుంద: ఎండాకాలంలో ప్రభుత్వోద్యోగు లెక్కడ బడితే అక్కడ కొబ్బరికాయలుతీసుకోవచ్చునని ప్రకటించండి. బ్రహ్మాస్త్రం ప్రతివాళ్ళ చేతిలోను పెట్టలేదని భారత రామాయణాలు చెపుతున్నాయి. దాన్ని ప్రయోగించడం ఉపసంహారం చేయడం తపోనిష్ఠద్వారా తెల్సుకోకపోతే ప్రపంచం దహనమవుతుంది. వజ్రాయుధం ఒక ఇంద్రుని వద్దనేవుంది. పిచ్చుకలమీదగూడ ప్రయోగించే ప్రమాదం వుందనే యీ బ్రహ్మాస్త్రం యీ ప్రభుత్వాని కివ్వగూడదని చెపుతున్నాము. మహారాక్షసు లెలాగూ తప్పించుకొని పోతున్నారు... తనిఖీ, సోదా ఆపుచేసేరనే నేరానికి రు. 200 జరిమానా చాలు అన్నారు.

మంత్రి: ఆపుచేసేరనే దానిలో పెద్ద మల్లయుద్ధమే జరగవచ్చు. ఆ యుద్ధంలో ఆఫీసరు క్రిందపడి రక్తంకారవచ్చు. రూళ్ళకర్ర తీసుకుని వేళ్ళు బద్దలుకొట్టిన కేసులుగూడా కొన్నివచ్చాయి. వీటి తీవ్రతనుబట్టి మేజస్ట్రేటులు శిక్ష ఎంత వుండాలో నిర్ణయిస్తారు. వారిమీద విశ్వాసం లేకపోతే

ఎట్లా ? సవరణ వీగిపోయింది. వోటింగులో అనుకూలురు 36, వ్యతిరేకులు 114.

ఆలాగే రిటరన్ సకాలంలో పంపనివారికిగూడ శిక్ష 200 రూ॥లకు తగ్గించమని సవరణ తేబడింది. "ఉద్దేశపూర్వకముగా" రిటరన్ పంపనివారికి మాత్రం శిక్షను పరిమితం చేయడానికి ప్రభుత్వం అంగీకరించలేదు. చిన్నవ్యాపారులను బెదరించడానికి ఆఫీసర్లకు స్వేచ్ఛగా యిది వుపయోగపడుతుంది....ఉద్దేశ పూర్వకముగా అన్న సవరణ అంగీకరించలేదు గనక కనీసం యీ సవరణైనా ఒప్పుకోమని కోరినప్పటికి ఒప్పుకోలేదు. సవరణ వీగిపోయింది.

తరువాత-మొదటిసారి తప్పుఅయితే రు. 2000 వరకు రెండవసారి ఆ తరువాత తప్పుఅయితే రు. 2000 జరిమానా లేక 6 నెలలు శిక్ష లేక రెండూను అనేదానికి బదులు మొదటి తప్పుగాక మిగతా తప్పులకు తప్పకుండా 3 నుండి 6 నెలలవరకు జైలుశిక్ష విధించవలెను. కాని రు. 20,000 మించి పన్ను ఎగవేసినవానిమీదే యీ సబ్‌క్లాజును అమలు జరపాలని సవరణ తేబడింది. దీని నంగీకరిస్తే ప్రభుత్వానికి బ్రహ్మాస్త్రం ఉండనూ ఉంటుంది, పిచ్చుకలమీద గాకండా రాక్షసులమీద ప్రయోగించాలనే ధర్మమూ ఉంటుంది. పన్ను ఎగవేసినవానికి 1½ రెట్లు యిస్తానని ఆఫీసరుతో రాజీపడి కోర్టు కెళ్లకండా తప్పించుకోడానికి వీలుగా మరొక క్లాజు వుంది. ఆ క్లాజుక్రింద ఒకడు రు. 10,000 పన్ను ఎగగొట్టగా, 1½ రెట్లు 15000 పెనాల్టీకలిపి 25,000 వసూలుచేయాలి. కాని అదీచాలక ప్రాసిక్యూషన్ ప్రారంభించేదు ఆఫీసరు.

కేసులో చివరకు రు. 2,000 జరిమానావేసి విడిచిపెడ్తారు. ప్రభుత్వం ఎంత చులకన వుతుంది? అందుచేత 3 నెలలకు తక్కువ గాకుండా జైలుశిక్ష విధించాలని మా సవరణ.

మంత్రి సమాధానం యిస్తూ పెద్దవాళ్ళ కొకశిక్ష, చిన్నవాళ్ళకు మరొక శిక్ష అని తేడాలు పెట్టడం బాగాలేదని సవరణను అంగీకరించలేదు. వీగిపోయింది. అనుకూలం 29, వ్యతిరేకులు 63.

31 క్లాజు (2) సబ్ క్లాజుప్రకారం కోర్టులో కేసు పెట్టేటపుడు కమర్షల్ టాక్స్ ఆఫీసర్ కి బదులు కమర్షల్ టాక్స్ కమీషనర్ అనుమతి వుండాలని సవరణ తేబడింది. మంత్రి అంగీకరించలేదు. వీగిపోయింది.

షెడ్యూలు II లో 3 వ పద్దు మధ్యరకం గుడ్డలకు 6 న. పై. బదులు 4 న. పై. పన్ను ఉండాలని సవరణ తెచ్చినాము. అనేక రాష్ట్రములలో దీనిమీద సాధారణ పన్నే వేసినారుగాని ఆంధ్రలోవలె హెచ్చుపన్ను వేయలేదు. కాని దీనికి మంత్రి అంగీకరించలేదు. ఈ గుడ్డకు ఇంతపన్ను వుండడం మొదట ఇండియాప్రెసిడెంటుగూడా అభ్యంతరం తెలిపినారట. మద్రాసువారు ముందుగాపోరాడి అనుమతి సంపాదించుకున్నారట. తరువాత ఆంధ్రప్రభుత్వం సంపాదించుకుంది. ఇంతజరిగిన తరువాత యిక వెనక్కు వెళ్ళలేమన్నారు. ప్రజలందరూ ఉపయోగించే యీ గుడ్డమీదనే ప్రభుత్వాని కేమైనా ఆదాయం రావాలన్నారు. సవరణ వీగిపోయింది.

అగ్గిపెట్టెలమీద 5. న. పై. బదులు 3 న. పై. ఉండాలని సవరణపెట్టేము. అగ్నిహోత్రుడు చాలా పవిత్రమైన దేవుడు. ఆయనమీద పన్ను వేయడమే పొరబాటు. అందులో 5 న. పై. వేయడం దారుణం. కాబట్టి 3. న. పై. కు తగ్గించమన్నాం. ఈస్వల్ప మార్పువల్ల కొనేవారికి తేడా కనిపించదు గాబట్టి సవరణను అంగీకరించనన్నారు మంత్రి. వీగిపోయింది.

చక్కెరమీద 8. న. పై. బదులు 6 న. పై. పన్ను వుండాలని సవరణతేగా మంత్రి అంగీకరించనందున వీగి పోయింది.

2వ షెడ్యూలులో 24. పద్దు సిగరెట్లకు 8 న. పై. నుండి 5 న. పై.కు తగ్గించమని 25 వ పద్దు సిగరెట్లకు 16 న.పై. నుండి 10 న. పై. కు తగ్గించమని, 27 వ పద్దు చుట్టలకు 16 న. పై. నుండి 10 న. పై. కు తగ్గించమని, 28 వ పద్దు పైపు పొగాకు 16 న. పై. నుండి 10 న. పై. కు తగ్గించమని, బీడీలకు 3. న. పై. నుండి 1 న. పై కి తగ్గించమని సవరణల నిచ్చినాము. వర్జీనియా పొగాకుమీద పన్ను ఎలాగూ వుంది గనక యింత పెద్ద పన్ను మధ్యరకం సిగరెట్లమీద వేయడం మంచిపనిగాదు. ఒక్కొక్క చుట్ట 0-2-0 అమ్ముతుంటే 3 న. పై. వేసేరు. 10 సిగరెట్లు 0-5-0 అమ్ముతుంటే 16 న. పై. వేసేరు. దీని వెనకాల ఉన్న సూత్రం ఏమిటి? ముక్కుపొడి, బీడీలు, నమిలే పుగాకు వీటిమీద యిదివరకు పన్ను లేదు. ఇప్పుడైనా లేకపోవడమే మంచిది. కాని మీరు అంగీకరించరు. కనీసం 3 న. పై.. లను 1 న. పై. కు తగ్గించండి. అని చెప్పగా మంత్రి వినలేదు. ఈ స్వల్ప తేడాల

వల్ల వాడకందార్లకు ధరలు తగ్గవుగాని. వర్తకులకు లాభిస్తుందట. సవరణలు వీగిపోయినాయి.

చేనేతగుడ్డ మీాద అసలు పన్నుండరాదని సెలెక్టు కమిటిలో అందరూ అన్నారు. అయినా 1% పన్ను విధిం చారు. ఇదేమిన్యాయం అంటే, అపుడు మల్టిపాయింటుగా పెడదామనుకున్నాం. యిపుడు సింగిల్ పాయింటు చేసేం. ఇది సదుపాయమే గదా అన్నారు.

వంట చెరుకు, బెల్లం, రసాయనిక ఎరువులు, ఎముకల పిండి, గానుగపిండి, శిరస్నానానికి స్త్రీలు ఉపయోగించే తైలాలు మొదలైనవాటిని అత్యవసర వస్తువుల జాబితాలో చేర్చి పన్ను మినహాయించడం మంచిది, లేదా 1% పన్నుకు మించకుండానైనా చేయండి. అంటే ఒప్పుకోలేదు.

షెడ్యూలు III లో వర్జీనియా పుగాకుకు 1 న.పై., బియ్యంకు 1 న. పై., కొబ్బరికాయలకు 1 న. పై., మెట్ట ధాన్యములకు 3 న. పై. చొప్పున పన్నులుండాలని సవరణలు తేబడ్డాయి. పప్పుధాన్యములు, చింతపండు, మిరపకాయలు వీటిమీాద మల్టిపాయింటు 2% పన్నుగాకుండా, మొదటి కొను గోలుమీాద మాత్రం 1% పన్ను ఉండాలని సవరణలు తెచ్చి నాము. కాని వీగిపోయినాయి.

# పి. డి.యఫ్. కమ్యూనిస్టు బ్లాక్ తరఫున నోటిఫికేషన్లకు, రూల్సుకు ప్రవేశపెట్టిన సవరణలు

నోటిఫికేషన్లు :

IV. పన్నునుండి మినహాయించవలసిన వస్తువులలో ఖద్దరుతో పాటు అన్ని చేనేత గుడ్డలను చేర్చవలెను.

X. విద్యాలయాలు, భోజన వసతి గృహములతో పాటు లాభాపేక్ష లేకుండా నడుపబడే అన్ని విద్యార్థి వసతి గృహములను పన్నునుండి మినహాయించవలెను.

XIII, XIV. బంగాళా దుంపలు, ఉల్లిపాయలు రు 20,000/- కు మించిన అమ్మకముంటే ఆ మించిన అమ్మకానికి మాత్రమే రూపాయికి రెండు నయాపైసల చొప్పున పన్నుకట్టాలి. మొత్తం అంతకు రెండు నయాపైసలు చొప్పున కట్టరాదు.

తరువాత... 14-6-57, జి. ఓ. లో తెలంగాణాను మూడు డివిజనులుగా విభజించి, ఒక్కొక్కదానికి ఒక్కొక్క డిప్యూటీ కమిషనర్‌ను నియమించి మూడు ఆఫీసులూ హైద్రాబాద్‌లోనే వుంటాయన్నారు. 3 వ డివిజన్‌కు, వరంగల్, ఖమ్మం, నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాలుబదులు, కరీంనగర్

వరంగల్, ఖమ్మం మూడు జిల్లాలేవుంచి డిప్యూటీ కమిషనర్ ఆఫీసును వరంగల్‌లో పెట్టమని సవరణ కోరడమైనది.

సవరణలు రూల్సుకేగాని నోటిఫికేషన్లకు ప్రతిపాదించరాదని ఆర్థికమంత్రి వాదించేరు. ప్రతిపక్షం వారీవిధంగా వాదించేరు: రూల్సులోకి రావలసినవిగూడ యుక్తితో నోటిఫికేషన్సులోకి లాగితే అపుడు మేమేమి చేయాలి? శాసన సభలోను సెలెక్టు కమిటీలోను చేనేతగుడ్డ అంతటిని పన్ను నుండి మినహాయించే రీతిగా రూల్సు తయారుచేస్తామని మంత్రులన్నారు. ఇపుడు దానిమీద పన్ను విధించి, నోటిఫికేషనులో చేర్చేరు. తంతు ప్రకారం నోటిఫికేషనులకు సవరణలే చెల్లవంటున్నారు. మంత్రుల ఈ పద్ధతి సమర్థనీయంగాదు.

తంతునుబట్టి నోటిఫికేషనులకు సవరణలు ప్రతిపాదించరాదని నిర్ణయించి అధ్యక్షులు అన్నిటినీ త్రోసివేసినారు.

## రూల్సుమీద ప్రతిపక్షంతెచ్చిన సవరణలు

4 వ రూలు: అప్పిలేట్ ట్రిబ్యునల్‌కు మూడవ న్యాయమూర్తి "ఎక్కౌంట్సులో అనుభవము, నిర్ణయించబోయే అర్హతలుగలవారై వుండాలి" అనుటకు బదులు "ఒక ఛార్టర్డు ఎక్కౌంటెంటుగాని, యం. కాం. పట్టభద్రుడై పెద్దవ్యాపారసంస్థలోనైనా ఎక్కౌంట్సు డిపార్టుమెంటులోనైనా పదేళ్ళ అనుభవముగలవారై వుండాలి" అని సవరించవలెను.

8 వ, 17 వ రూల్సుగురించి మాట్లాడుతూ రు 50,000/- మించిన టర్నోవరు గల వారికిచ్చిన సదుపాయమే చిన్న

వర్తకు లందరికీ కలగజేయమని కోరినాము. కాని అధికారులకు పని పెరుగుతుందని చెప్పి తిరస్కరించేరు.

13 వ రూలు దిగువ "కాజుయల్ డీలరుగూడా ఫారం "ఎ"లో నెలకుగాని నెలలో భాగానికిగాని తన అంచనా టర్నోవరు చూపుతూ రిటరన్ దాఖలు చేయాలి.

వివరణ : "ఈమొత్తం రూలు అంతా ఒకనెలలో రు 1000/- మించిన టర్నోవరు గలవారికే వర్తిస్తుంది"

ఈ వివరణను రూలులో చేర్చాలని కోరడమైనది. చిన్నవాళ్ళకు కష్టం లేకుండా కాజుయల్ ట్రేడర్ నిర్వచనం వుండాలని ప్రతిపక్షంవారు బిల్లును చర్చించేప్పుడే సవరణలు ప్రతిపాదించేరు. ఆపని రూల్సులో చేస్తామని హామీయిచ్చి అపుడు మా సవరణలను మంత్రి తిరస్కరించేరు. కాని ఆ హామీప్రకారం ఈరూలు తయారుచేయ లేదు. అందువల్ల ఒక నెలలో రు 1000/- లోపు టర్నోవరుగల చిన్న కాజుయల్ డీలర్ల రక్షణకోసం యీ సవరణ తేవడమైనది.

ఆచరణలో చిన్నవారిని బాధపెట్టకండా చూస్తాము గాని, సవరణమాత్రం అంగీకరించం అన్నారు మంత్రిగారు.

రూలు 26 : పన్ను మినహాయింపు సాలుకు రు 1200 టర్నోవర్ గల చుట్టల వ్యాపారస్తులకే. అనగా రోజుకు సుమారు. 3/ అమ్మేవారికి మాత్రమే. ప్రత్యేకంగా చుట్టలు చుట్టి అమ్ముకోడ మొక్కటే వృత్తిగా పెట్టుకొన్నవారు రోజుకు రు. 3-8-0 అమ్మితే సేల్సుటాక్సు ఆఫీసరు చేతిలో చిక్కవలసిందేనా ? రిటరనులు తయారు చేసి, పన్నుకట్టి, లెక్కలన్నీ చూపి, రిబేటు కోరాలా ? పుగాకుమీద దారుణమైన

పన్నులున్నాయి గనక "రు. 1200 లోపు టర్నోవరుగలవారు మాత్రమే ప్రత్యేకంగా వాటిలో వ్యాపారంచేసేవారు మాత్రమే" అన్నమాటలు తీసివేయమని సవరణ తేవడమైనది. కాని మంత్రి తిరస్కరించేరు.

రూలు 28 లో దిగువ యీవిధంగా చేర్చవలెను: "కాని ధాన్యం మరపట్టి బియ్యంగా అమ్మినా, చెరుకునువండి బెల్లంగా అమ్మినా యిలాంటి రూపాంతరాలు చేసి అమ్మిన వ్యవసాయసరుకుల ఉత్పత్తిదారుని డీలరుగా ఎంచరాదు."

శ్రీసుందరయ్యగారు తెచ్చిన యీ సవరణమీద చాలా తర్జనభర్జన జరిగింది. శాసనసభ ముగిసేరోజున యిక టైము లేక మొత్తంరూల్సుమీద జరిగే చర్చను అసంపూర్తిగా ఆపివేసేరు.

రూల్సు శాసనసభలో ప్యాస్‌గాకపోయినా అవి అమలులోకి వస్తాయి.

ఈ దిగువ సవరణలుగూడ పి. డి. యఫ్. కమ్యూనిస్టు బ్లాక్‌వారు పంపినారు.

రూలు 28 (11) : సాలు మధ్యలో ఒక వ్యాపారస్తుడు మరొకనికి వ్యాపారమంతా అమ్ముకుంటే, ఫీజుకట్టి కొత్త లైసెన్సుకు దరఖాస్తు పెట్టేదానికి బదులు ఫీజులేకుండా ఆ సంవత్సరంలో మిగతా భాగానికి కొత్త లైసెన్సు యివ్వవలెను.

రూలు 29 (7) : అంచనా పన్నులో సగంవరకు ఖజానాలో డిపాజిట్ చేయమని ఆఫీసరు కోరవచ్చుననే యీ

రూలు పాతవర్తకులకే గాని కొత్తగా రిజస్టర్ చేయించుకొనే వర్తకులకు వర్తించకండా చేయవలెను.

రూలు 33 : ఎక్కువ వ్యయప్రయాసలతో అప్పిలేట్ ట్రిబ్యునల్‌కు వెళ్ళేముందు రివెన్యూబోర్డుకు రివిజన్‌పిటీషన్ పెట్టుకొనే అవకాశం తగాదా పడుతున్న ఆసామీకి కల్పించవలెను.

రూలు 45 : రు 5/- కు తక్కువకాని ప్రతిఅమ్మకానికి కొనేవాడు కోరితే అంతకు తక్కువ అమ్మకానికిగూడా బిల్లు యిచ్చితీరవలెనన్న నిర్బంధం రు 20,000 లోపు టర్నోవరు గల వారికి ఆ సరుకులు సింగిల్‌పాయింటు పన్నులైనను వర్తించకుండా చేయవలెను.

రూలు 49 : సోదాచేసేటపుడు అధికారి తనతోపాటు గుర్తింపబడిన స్థానికవర్తకసంఘ కార్యవర్గసభ్యుని కొనిపోవలెను.

మేము నోటీసిచ్చిన పై సవరణలు చర్చించబడకుండానే శాసనసభ ముగిసింది.

# 1 వ అనుబంధం

## సెంట్రల్ (కేంద్ర) అమ్మకపు పన్ను చట్టం 1956
## (ఢిల్లీ పార్లమెంటులో వ్రాసినది)

అంతర్రాష్ట్రీయ వ్యాపారంలో అమ్మకానికి, కొనుగోలుకు యీ చట్టం వర్తిస్తుంది.

రిజిస్ట్రేషన్ : ఈ చట్టం ప్రకారం పన్ను చెల్లించవలసి వున్న ప్రతి డీలరు రాష్ట్ర అమ్మకపుపన్ను అధికారివద్దనే ఈ చట్టంక్రిందగూడా రిజిస్టరు చేయించుకోవాలి. ఆ అధికారే యీ చట్టంక్రిందగూడ పన్ను విధించడం మొదలైన పనులు నిర్వహించును. రాష్ట్ర చట్టంలోని నిబంధనల ననుసరించే యీ చట్టాన్ని అమలు జరుపుతారు. ఈ చట్టంక్రింద వచ్చిన ఆదాయం, ఖర్చులు పోను మిగతాది ఆయా రాష్ట్ర ప్రభుత్వములకే యివ్వబడును. అంతర్రాష్ట్రీయ వ్యాపారంలో డిక్లేర్డు సరుకులకు టర్నోవరు మీద 1% పన్ను చెల్లించాలి.

మిగతా సరుకులలో అంతర్రాష్ట్రీయ వ్యాపారం చేస్తే ఆ రాష్ట్రంలో ఏ రేటు అమలులో వుంటే ఆ రేటునే యీ చట్టంక్రింద చెల్లించాలి.

డిక్లేరుడు సరుకులజాబితా : రాక్షసిబొగ్గు, ఇనుము, ఉక్కు, ప్రత్తి, తోళ్ళు, చర్మాలు, జనపనార, నూనె గింజలు.

ఈ డిక్లేర్డు సరుకులమీద రాష్ట్రప్రభుత్వములు రాష్ట్ర ఆంతరంగిక వ్యాపారంలో పన్ను విధించదలుచుకుంటే సింగిల్ పాయింటుపన్ను 2% మించకుండా మాత్రమే వేయాలి.

దీనికి సంబంధించిన నోటిఫికేషనులు వగైరా కేంద్ర ప్రభుత్వ గెజెట్‌లో ప్రకటింపబడతాయి.

1952 సంవత్సరపు ఎస్సెన్షియల్ గూడ్సుచట్టం దీనితో రద్దు అయింది.

ఈచట్టంక్రింద ఆంధ్రప్రదేశ్ గవర్నరుకు వచ్చిన అధికారాన్నిబట్టి ఒక నియమావళిని గెజెట్‌లో ప్రకటించేరు.

# 2 వ అనుబంధం

## సరుకుల అమ్మకంమీద లేక కొనుగోలుమీద పన్ను విధించే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు (1957 లో 4 వ) చట్టం

1 వ క్లాజు : దీనికి "ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకపు పన్ను చట్టం 1957" అని పేరు.

2 వ క్లాజు : నిర్వచనాలు : (ఎ)...(బి)...(సి) కాజుయల్ ట్రేడర్ అనగా యజమానిగాగాని ఏజంటుగా గాని మరే హోదాలోగాని నగదుకుగాని అప్పుగాగాని కమిషన్‌కుగాని మరి యే యితర ప్రతిఫలానికిగాని యీ స్టేట్‌లో కొనడం లేక అమ్మడం లేక సప్లయి చేయడం లేక పంపకం చేయడం "తాత్కాలికంగా" జరిపించినవాడు అని అర్థం. (డి)...(ఇ) డీలర్ అనగా నగదుకు లేక అప్పుకు లేక కమిషన్‌కు లేక ఇతర ప్రతిఫలమునకు అమ్మడం లేక కొనడం లేక సప్లయి చేయడం లేక పంపకం చేయుడం ప్రత్యక్షంగా గాని పరోక్షంగాగాని జరిపించినవాడు అని అర్థం. ఈ పదం యీ దిగువవారికిగూడా వర్తిస్తుంది: (ఎ) స్టేట్ ప్రభుత్వ స్థానిక ప్రభుత్వ హోదాగల సంస్థలు, కంపెనీ, అవిభక్త హిందూ కుటుంబం, కోపరేటివ్ సొసైటీలతోసహా అన్ని

సొసైటీలు, క్లబ్, ఫరం, ఎసోసియేషన్ వ్యాపారంచేసే ఏ సంస్థఅయినా సరే (బి) తన మెంబర్లకు అమ్మే లేక సప్లయి చేసే లేక।వారినుండి కొనే సొసైటీ (కోపరేటివ్ అయినాసరే) ఫరం, క్లబ్, ఎసోసియేషన్ (సి) ఇదివరకు వివరించిన ప్రకారం కాజుయల్ డీలర్ (డి) కమిషన్ ఏజంటు, బ్రోకరు, డెలివరీ ఏజంటు, వేలంపాటదారు, స్టేట్‌బయట నివసించే యజమాని తరఫున వ్యవహరించే ఏజంటుగాని బ్రాంచిగాని అందరూ డీలరుగా వ్యవహరింపబడతారు...(యఫ్) డిక్లేర్డు గూడ్సు అనగా 1956 లో 74 వ చట్టంగా పార్లమెంటులో ప్యాసైన కేంద్ర అమ్మకపుపన్ను చట్టం 14 వ సెక్షన్ క్రింద ప్రకటింపబడి అంతర్రాష్ట్రీయ వ్యాపారరీత్యా ప్రాముఖ్యతగల వస్తువులు...(జి)...(హెచ్)...(ఐ)...(జె) నోటిఫికేషన్ అనగా ఆంధ్రప్రదేశ్ గజెట్‌లో ప్రకటనఅని అర్థం (కె) వ్యాపారస్థలం అనగా వ్యాపారస్థుడు కొనే, అమ్మే స్టోర్ చేసే లెక్కలుంచే స్థలాలన్నమాట, (యల్) నిర్ణయింపబడిన అనగా ఈ చట్టానికి సంబంధించిన రూల్సులో నిర్ణయింప బడిన అని అర్థం. (యం)...(యన్)...(ఒ)...(పి)...(క్యూ) ...(ఆర్)...మొత్తం టర్నోవర్ అనగా పన్ను చెల్లించ వలసిన, చెల్లించ నవసరంలేని అన్నిరకాల సరుకుల మొత్తం టర్నోవర్, స్టేట్‌లో అన్ని బ్రాంచీలలోని టర్నోవరు అని అర్థం. (యస్) టర్నోవర్ అనగా బిల్లులో సరుకుల ఖరీదుతో కలిపిన యితరములు గూడాను (ఉదా: దేవుడు పైసలు ధర్మం వగైరా) అని అర్థం. రైతు తాను పండించిన సరుకును

రూపాంతరం చేయకుండా అమ్మితే ఆ సరుకు యీ టర్నోవర్‌లో చేరదు (ఉదా: చెఱకును బెల్లంగా మార్చడం).

3 వ క్లాజు : అప్పిలేట్ ట్రిబ్యునల్ : స్టేట్ ప్రభుత్వం ఒక జిల్లా జడ్జి హోదాకు తక్కువగాని న్యాయాధికారి ఆధ్వర్యాన మరొక యిద్దరితో గూడిన ట్రిబ్యునల్‌ను ఏర్పరుస్తుంది. రు. 20,000 లోపు టర్నోవర్ గల అప్పీలు కేసులను ఒకే జడ్జి విచారించును. ముగ్గురు విచారించిన కేసుల్లో అభిప్రాయ భేదాలుంటే ట్రిబ్యునల్‌లో మెజారిటీ నిర్ణయం ఖాయపడుతుంది. ఇద్దరువిచారించిన కేసుల్లో అభిప్రాయ భేదముంటే ముగ్గురి విచారణకు పంపబడుతుంది. ప్రభుత్వ అనుమతితో ట్రిబ్యునల్ తన నిత్యకృత్యానికి నియమావళి నిర్ణయించుకుంటుంది. ఈ నియమావళి ఆంధ్రప్రదేశ్ గెజెట్‌లో ప్రకటింపబడుతుంది.

4 వ క్లాజు...

5 వ క్లాజు: పన్ను - (1) కాజువల్ ట్రేడర్ కానివాడుతప్ప, స్టేట్ బయటనున్న యజమాని యొక్క ఏజంటు తప్ప, మిగతా వ్యాపారస్థులు, ఏజంట్లు అందరూ రు. 10,000 కు మించిన సాలీనా వ్యాపారం చేసేవారు ప్రతి రూపాయి టర్నోవర్ మీద రెండు నయాపైసలు పన్ను చెల్లించాలి. స్టేట్ బైటనున్న యజమానియొక్క ఏజంటైనా, కాజువల్ ట్రేడర్ ఐనా అయితే యీ రు. 10,000 లోపు వ్యాపారం చేసినాసరే పన్ను చెల్లించాలి.

ఒకవేళ హోటల్సు వసతిగృహాలైతే వారు అమ్మే, తినే, త్రాగే వస్తువులమీద రూపాయికి 3 నయాపైసలు

పన్ను. కాని యీ తరగతిలో రు. 25,000 టర్నోవర్ మించితేనే పన్ను.

(2) ఈ చట్టం మొదటి షెడ్యూల్‌లో చేర్చిన ఏ సరుకులలోనైనా బేరం చేస్తే ఆ షెడ్యూల్లో చూపిన అమ్మకపు పన్ను రేట్లు పైన చెప్పిన సాధారణ పన్నుతో కలిపి "అదనంగా" చెల్లించాలి.

(3) - (ఎ) టర్నోవరు "రు. 10,000 లోపు అయినా సరే" 2 వ షెడ్యూల్లోని సరుకులకు దానిలో చూపిన పాయింటువద్ద దానిలో చూపిన రేట్ల ప్రకారం అమ్మకపుపన్ను చెల్లించాలి.

(బి) 3 వ షెడ్యూల్‌లోని సరుకులకు దానిలో చెప్పిన పాయింటువద్ద దానిలో సూచించిన రేట్ల ప్రకారం "కొనుగోలుపన్ను" చెల్లించాలి. టర్నోవరు రు. 10,000 లోపు అయినాసరే.

(4) టర్నోవర్ నుండి ఖర్చులు వగైరా మినహాయించవలసిన వాటి విషయం రూల్సుద్వారా నిర్ణయించబడును.

6 వ క్లాజు : (4) షెడ్యూల్‌లో "డిక్లేర్డు" సరుకులకు దానిలో చెప్పిన పాయింటువద్ద దానిలో చెప్పినరేట్ల ప్రకారం కనిష్ట అమ్మకం రూలుతో నిమిత్తం లేకుండా పన్ను చెల్లించవలెను.

7 వ క్లాజు...

8 వ క్లాజు : పన్ను లేని సరుకులు : 5 వ షెడ్యూల్ లోని సరుకులకు పన్ను లేదు. ఈ వ్యాపారులు అనుసరించవలసిన నిబంధనలు, రూల్సు తయారు చేయబడును.

9 వ క్లాజు : ఇంకా మినహాయింపులు, పన్ను తగ్గింపులు గెజెట్ ప్రకటనద్వారా ప్రభుత్వం చేయవచ్చును.

10 వ క్లాజు...

11 వ క్లాజు : ఒకరకం ఎజంట్లకు లైసెన్సు లేదా మినహాయింపు :- కమిషన్‌కుగాని బ్రోకరేజ్‌కిగాని (5-6 సెక్షనుల క్రిందకు వచ్చేవి) ఒప్పుకొన్న బేరం నిర్వహించడానికి దరఖాస్తు పెట్టి ప్రత్యేక లైసెన్సు పొందవచ్చు. లైసెన్సులోని షరతుల ప్రకారం ప్రవర్తించి పన్ను తగలకుండా మినహాయింపు చేసుకోవచ్చు.

12 వ క్లాజు : డీలర్సు, రిజిస్ట్రేషన్ : కాజువల్ డీలర్ కానివాడున్నూ, సాలుకు రు. 75000 కు తక్కువ గాకుండా వ్యాపారం చేసేవాడున్నూ, రాష్ట్రానికి బైటనున్న యజమానికి ఏజంటుగా పనిచేసేవాడున్నూ రిజిష్టరు చేయించుకోవాలి...రూల్సులో నిర్ణయింపబడిన ప్రకారం వీరు ప్రతి సంవత్సరం ఫీజు చెల్లిస్తుండాలి ... రెండేళ్ళు వరసగా 7500 కు లోపే వ్యాపారం జరిగితే రిజిస్ట్రేషన్ రద్దు చేయించుకోవచ్చు ... ఇంటింట తిరిగి అమ్ముకునే హాకర్సు, చిన్న బంక్ (64 చ॥ అ॥ మించని) దారులు తప్ప — మిగతా వారంతా వారి టర్నోవరు ఎంతైనప్పటికీ రెండు మూడు నాల్గు షెడ్యూల్సులోని సరుకుల వ్యాపారం చేస్తే రిజిష్టరు చేయించుకోవాలి ... డీలరుకు అనేక వ్యాపారస్థలాలు, బ్రాంచీల్లు వుంటే రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్‌లు వాటన్నింటికి పొందాలి ...

13 వ క్లాజు...

14 వ క్లాజు : డీలరు దాఖలుచేసిన రిటరన్ సవ్యంగా లేదని 4 ఏళ్ళలోపున ఎపుడుతోచినా అధికారి మరల డీలరు వల్ల సంజాయిషీ తీసుకొని పన్నును సవరించవచ్చును. లైసెన్సింగ్ విధులు తప్పినట్టు కన్పించినా, లెక్కలలో కొన్నిటిని మభ్యపర్చినట్టు రుజువైనా 4 ఏళ్ళలోపున పన్నుగాక దానికి ఒకటిన్నర రెట్లు పెనాల్టీగూడ వేయవచ్చు.

15 వ క్లాజు : నెలవారీగా టర్నోవర్‌కు సంబంధించిన రిటరన్‌ను డీలరునుండి తెప్పించి తాత్కాలికంగా పన్ను అంచనావేసి నెలవారీగాగాని, మరోవిధంగాగాని పన్ను చెల్లించే ఏర్పాటు చేయవచ్చు.

16 వ క్లాజు : పన్నులుగాని, అపరాధములుగాని తెలియపర్చిన 15 రోజుల్లోపుగా గాకుండా నిర్ణయింపబడిన కాలంలో చెల్లించాలి.

... రెవిన్యూబోర్డు యీ కాలపరిమితిని దరఖాస్తు పెట్టుకుంటే సవరించవచ్చు; వాయిదాలమీద చెల్లించేపద్ధతికి అనుమతించవచ్చు ... సకాలంలో పన్ను చెల్లించకపోతే ఆతరువాత మొదటి 3 మాసాలకు నెలకు నూటికి 0-8-0 చొప్పున పెనాల్టీ చెల్లించాలి. తరువాత ప్రతిమాసానికి నూటికి 1-0-0 చొప్పున చెల్లించాలి.

17 వ క్లాజు : డీలరునుండి రావలసిన పన్నును కారణాంతరములవల్ల అతనికి బాకీవున్న ఖాతాదారులనుండిగూడా ప్రభుత్వం రాబట్టవచ్చు.

18 వ క్లాజు :

19 వ క్లాజు : అప్పీళ్ళు : రూల్సులో నిర్ణయింపబడిన వారికి తీర్పు చెప్పిన 30 రోజుల్లోగా అప్పీలు చేసుకోవచ్చు. పన్నులు, పెనాల్టీలు అంతా చెల్లించేవరకు అప్పీలు పట్టరు. అప్పీలుకు స్టాంపు డ్యూటీ నిర్ణయింపబడుతుంది. అప్పీలు స్వీకరించేవారు 30 రోజుల గడువు గురించిగాని, పన్ను పెనాల్టీ ముందు చెల్లించే విషయం గురించిగాని తగిన కారణ ముంటే మినహాయింపు య్యివ్వవచ్చు.

20 వ క్లాజు : రివిన్యూబోర్డుగాని నిర్ణయింపబడ్డ మరో అధికారిగాని క్రింది అధికారియొక్క పన్ను తీర్మానమును పునఃపరిశీలన తమకు తామే 4 ఏళ్ళలోపున చేయువచ్చు. (రివిజన్) పన్ను తీర్మానం మార్చే పక్షంలో డీలరు సంజా యిషీ వినాలి.

21 వ క్లాజు : అప్పిలేట్ ట్రిబ్యునల్: పైన 20 సెక్షలో చెప్పిన ప్రకారం పన్ను గురించి కొత్త తీర్మానం చేస్తే ట్రిబ్యునల్‌కు 60 రోజుల్లోగా అప్పీలు చేసుకోవచ్చు. దానికి రు. 100/ కు మించకుండా నిర్ణయింపబడే ఫీజు చెల్లించాలి. ట్రిబ్యునల్ 60 రోజుల గడువును కారణం చూపితే పొడిగించ వచ్చు. ఈ అప్పీలులో ఒక లాపాయింటు ప్రధానాంశంగా తేలితే, ఆ పాయింటుమీద అపుడు హైకోర్టులోగాని, సుప్రీం కోర్టులోగాని కేసు నడుస్తూంటే అది తేలేవరకు ట్రిబ్యునల్ తీర్మానం చెప్పరాదు. పన్నులు, పెనాల్టీలు పూర్తిగా చెల్లించేవరకు ట్రిబ్యునల్ అప్పీలు తీసుకోదు.

22 వ క్లాజు : ట్రిబ్యునల్ తీర్మానంమీద లా పాయిం టును గురించి మాత్రం - 90 రోజుల్లోగా హైకోర్టుకు రివిజన్ పిటిషన్ పెట్టుకోవచ్చు. దీనికిగూడ రు. 100/- ఫీజు చెల్లించాలి.

23 వ క్లాజు : రివిన్యూబోర్డు తీర్మానంమీద 60 రోజు లలోగా హైకోర్టుకు అప్పీలు చేసుకోవచ్చు.

24 వ క్లాజు : హైకోర్టులో ఇద్దరు తక్కువగాకుండా జడ్జీలు నియమింపబడిన బెంచిచేత మాత్రమే ఈ అప్పీళ్లు విచారింపబడవలెను.

25 వ క్లాజు :

26 వ క్లాజు : పడవ యజమానులు సరుకుల రవాణా లెక్కల్లో "లాగ్ బుక్కులు" వగైరా ఆఫీసరుకు దఖలు పర్చాలి.

27 వ క్లాజు : లారీల, వ్యానుల, బస్‌ల యజమానులు గూడా ట్రిప్‌షీట్లు వగైరా దఖలు పర్చాలి.

28 వ క్లాజు : తనిఖీకి అధికారాలు : అధికారికి అను మానం గల్గితే సోదాచేసి లెక్కల పుస్తకాలు, ఫైళ్ళు, కాగి తాలు స్వాధీనం చేసుకోవచ్చు. సోదాకు కారణాలను రికార్డు చేయాలి. తీసుకొన్న వస్తువులకు రశీదివ్వాలి. ఆ వస్తువులను పై అధికారి అనుమతిమీాదతప్ప 30 రోజుల కెక్కువ తనవద్ద వుంచుకోరాదు. సబబైన (రీజనబుల్) అన్ని వేళలా ఆఫీసులో, కొట్టులో, గోడౌన్‌లో, రవాణా వాహనంలో, పడవలో సోదాచేయవచ్చు...... ఇంటిలో సోదాచేయవలసివస్తే మేజస్ట్రీటు వారంటుండాలి. కాని ఇల్లు, కొట్టు కలిసివుంటే యీ వారంటు అక్కరలేదు. పెట్టెలు, గుమ్మాల తలుపులు

గూడా బ్రద్దలుకొట్టవచ్చు. యజమాని తలుపులు తెరవనంటేను లెక్కలలోలేని సరుకులను, సంజాయిషీ విని ప్రభుత్వపరం చేయవచ్చును. ఏ హోదాగల ఆఫీసరు యీ పని చేయవచ్చునో ప్రభుత్వం నిర్ణయిస్తుంది.

29 వ క్లాజు : త్రోవలో తనిఖీ చేయటానికి "చెక్ పోస్టులు" వగైరా గెజెట్‌లో ప్రకటించి ఏర్పాటు చేయవచ్చును. అధికారికి అవుసరం వున్నంతవరకు డ్రైవరు త్రోవలో లారీ, పడవ వగైరా ఆపవలెను. సరుకుల బిల్లులు వగైరా తనిఖీ చేయవచ్చు. సరుకుల యజమాని, వాహన యజమాని పేర్లను అధికారులు తీసుకోవచ్చును. అనుమానించ తగిన సరుకులు, రికార్డు స్వాధీనం చేసుకొనవచ్చును. ఆసామీకి సంజాయిషీ చెప్పుకొనే అవకాశం యిచ్చి తీర్పు చెప్పవలెను.

30 వ క్లాజు: నేరాలు, అపరాధాలు :

1. (ఎ) గడువులోగా పన్ను, పెనాల్టీ ఫీజు చెల్లించక పోయినా,

(బి) రిజిష్టరు చేయించుకోవలసినవారు చేయించుకోక పోయినా,

(సి) ఉద్దేశపూర్వకంగా యీ చట్టాన్ని, రూల్సును ఉల్లంఘించినా,

రెండువేల రూపాయలవరకు జరిమానా విధించవచ్చు.

2\. (ఎ) 28 సెక్షన్ క్రింద జరిగే సోదాను నిరోధించినా, ఆపుచేసినా

(బి) 29 సెక్షన్ క్రింద త్రోవల్లో చేసే తనిఖీని అభ్యంతరపెట్టినా, 6 నెలలు విడిఖైదు లేదా 2 వేల రూపాయల జరిమానా లేదా రెండూ విధించవచ్చు.

3\. (ఎ) ఉద్దేశపూర్వకంగా తప్పుడు రిటరన్ పంపడం గాని, అసలు రిటరనే పంపకపోవడంగాని చేసిన ఆసామీకి

(బి) పన్నునుండి, ఫీజునుండి అక్రమంగా తప్పించుకున్న ఆసామీకి మొదటి తప్పు అయితే రెండు వేల రూపాయలు జరిమానా, తరువాత చేసిన తప్పులకు 6 నెలలు విడిఖైదు లేక రెండువేలు జరిమానా లేక రెండూను.

31 వ క్లాజు :

(1) ఫస్టుక్లాస్ మేజిస్ట్రేట్ కోర్టుకు మాత్రమే యీ చట్టంక్రింది కేసులను విచారించే అధికారమున్నది.

(2) కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు యొక్క వ్రాత పూర్వకమైన అనుమతి లేకుండా 30 వ సెక్షన్ (2) వ సబ్ సెక్షన్ క్రింద కేసులు పెట్టరాదు. అలాగే రెండవ పర్యాయం గాని, ఆ తర్వాతగాని నేరంచేసిన ఆసామీ మీదగూడ 3 వ సబ్ సెక్షన్ క్రింద యిట్టి అనుమతి లేకుండా కేసు పెట్టరాదు.

32 వ క్లాజు: అపరాధి: (ఎ) పన్ను ఎగవేతకు పరిహారంగా పన్నుతోపాటు వెయ్యి రూపాయలకు మించని మొత్తంగాని, పన్నుకు రెట్టింపుగాని ఏది ఎక్కువైతే అది యిచ్చుకుంటానంటే అధికారి అంగీకరించవచ్చును.

(బి) అలాగే యితర అపరాధములలో వెయ్యి రూపాయలు మించకుండా ప్రభుత్వానికి చెల్లిస్తానంటే తీసుకుని ఒదిలిపెట్టవచ్చును.

33 వ క్లాజు:

34 వ క్లాజు: పన్ను వేసే లేక రివిజన్ చేసే లేక అప్పీల్ విచారించే అధికార్లు ఏ పార్టీకైనా అవసరమైన రికార్డులతో నిర్బంధంగా హాజరుకమ్మని సమను పంపవచ్చు.

35 వ క్లాజు:

36 వ క్లాజు:

37 వ క్లాజు: అక్రమ చర్యకోసం ఏ ప్రభుత్వోద్యోగి పైన అయినా ఒక ఆసామీ కోర్టులో చర్యతీసుకోదలిస్తే ముందుగా ప్రభుత్వంయొక్క అనుమతి పొందాలి. ఘటన జరిగినతర్వాత 6 మాసాలు దాటితే ఏ చర్యా తీసుకోబడదు.

(2) సదుద్దేశంతో గనుక ఉద్యోగ ధర్మంకొరకు చేసివుంటే ఏ ప్రభుత్వోద్యోగి సివిల్, క్రిమినల్ చర్యలకు గురి కానక్కరలేదు.

33 వ క్లాజు: స్టేట్ బైటగాని, దేశంబైటగాని కొనడం, అమ్మడం జరిగితే యీ చట్టంక్రింద పన్ను వేయబడదు. అంతర్రాష్ట్రీయ వ్యాపారానికిగూడా పన్ను వేయబడదు. (కాని కేంద్ర అమ్మకపుపన్ను చట్టం 1956 వర్తిస్తుంది.)

39 వ క్లాజు : ఈ చట్టాన్ని అమలుపర్చడానికి అధికారులు అనుసరించవలసిన రూల్సును ప్రభుత్వంచేసి గెజెట్‌లో ప్రకటిస్తుంది. అసెంబ్లీ సమావేశంలో వాటిని సభ్యుల కిచ్చిన 14 రోజులలోపున మార్పులు ప్రతిపాదించవచ్చు.

40 వ క్లాజు : శాసనసభ ఆమోదంపొంది షెడ్యూల్సులో మార్పులు చేయవచ్చు.

41 వ క్లాజు : ఈ కొత్త చట్టం ప్యాసైనది మొదలు ఈ దిగువ పాత చట్టాలు రద్దయినవి. (1) మద్రాస్ జనరల్ సేల్సుటాక్సు ఆక్టు 1939, (2) హైద్రాబాద్ జనరల్ సేల్సు టాక్సు ఆక్టు 1950, (3) మద్రాస్ పొగాకు ఆక్టు 1953, (4) ఆంధ్ర జనరల్ పర్చేజెస్ ఆక్టు 1956, (5) మద్రాస్ ప్రొహిబిషన్ 1937 ఆక్టులోని 21 వ సెక్షన్.

# షెడ్యూల్సు

1 వ షెడ్యూలు: (విలాసవస్తువుల జాబితా) సింగిల్ పాయింటు అమ్మకంపన్ను విధింపబడే సరుకులు; సాలీనా రు 10,000 కు మించిన అమ్మకం వున్నవారికి వర్తించును. 5 వ సెక్షను 1 వ సబ్ సెక్షన్ ప్రకారం సాధారణ అమ్మకంపన్ను నూటికి రెండు నయాపైసలు చెల్లిస్తూ అదిగాక అదనంగా 5 సెక్షన్ (2) సబ్ సెక్షన్ ప్రకారం యీ దిగువ పన్నులు చెల్లించాలి.

| | సరుకు వివరం | అదనపుపన్ను రేటు రూపాయి 1 కి |
|---|---|---|
| 1. | రిఫ్రిజిరేటర్లు - ఎయిర్ కండిషన్ యంత్రాలు వాటి వాటి విడిభాగాలు | 5 నయాపైసలు |
| 2. | వైర్‌లెస్ సెట్లు, లవుడ్‌స్పీకర్లు, విద్యుత్ వాల్వులు వాటి వాటి పరికరాలు | ,, |
| 3. | రేడియో, గ్రామఫోనులు పార్టులు | ,, |
| 4. | సినిమెటోగ్రాఫ్, ఫోటోగ్రాఫ్ సామానులు, పరికరాలు | ,, |
| 5. | దుర్భిణీయంత్రాలు - అద్దాలు | ,, |
| 6. | గ్రామఫోనులు, రికార్డులు | ,, |
| 7. | అప్‌హోల్స్టర్డ్ ఫర్నిచర్ | ,, |
| 8. | దంతపు లేక దంతపుచెక్కడం గల వస్తువులు | ,, |
| 9. | తుపాకులు, పిస్తోళ్ళు, పరికరాలు | ,, |
| 10. | సిగరెట్ కేసులు, యంత్రపు అగ్గిపెట్టెలు | ,, |
| 11. | ఫోము రబ్బరు, కుషనులు, యిత్యాదులు | ,, |
| 12. | పేకలు | ,, |
| 13. | సాలరాళ్ళు - వాటితో చేయబడ్డవి. | ,, |
| 14. | ఎలక్ట్రికల్ సామాను, పరికరాలు పంకాలు బల్బులు | 8 నయాపైసలు |
| 15. | రు 20/- కు మించిన కలం, పెన్సిలు లేక సెట్టు | ,, |
| 16. | గడియారములు - వాటి సామానులు | ,, |
| 17. | వజ్రాలు, పుష్యరాగాలు, కెంపులు, ముత్యాలు విడిగా లేక ఇతరములు జతగా | ,, |

2 వ షెడ్యూలు : సెక్షన్ 5 (3) (ఎ) ప్రకారం కనిష్ట టర్నోవరు రు. 10,000-/తో నిమిత్తం లేకుండా సింగిల్ పాయింట్ అమ్మకపు పన్ను విధించబడే వస్తువులు—పన్ను రేట్లు.

| సరుకు వివరం | ఏ పాయింటు వద్ద పన్ను | పన్ను రేటు రు. 1కి |
|---|---|---|
| 1. మిల్లు బట్ట ఫైన్ (సన్న) సూపర్ ఫైన (అతిసన్న) | రాష్ట్రంలో మొదటి అమ్మకం మీద మాత్రం | 9 న. పైసలు |
| 2. మిల్లుబట్ట సిల్కు- ఆర్ట్ సిల్కు- వూలు ఫ్లాక్సు ప్రత్తితో తయారు చేయబడనది లేక పూర్తిగాతయారుచేయబడనది | ,, | 9 ,, |
| 3. మీడియం (మధ్యరకం) మిల్లుబట్ట | ,, | 6 ,, |
| 4. ముతక మిల్లు బట్ట | ,, | 3 ,, |
| 5. హోజరీగుడ్డలు (ప్రత్తి నూలుతో తయారుచేయబడనివి) | ,, | 9 ,, |
| 6. అగ్గిపెట్టెలు | ,, | 5 ,, |
| 7. మోటారు బండ్లు, మోటారు సైకిల్స భాగాలు, పరికరాలు టైర్లు (ఇతర పనులకు గూడా ఉపయోగపడే వస్తువులు గాక) | ,, | 5 ,, |
| 8. సైకిళ్లు భాగాలు, పరికరాలు | ,, | 3 ,, |
| 9. వంటచెరుకు (కట్టె పుల్లలు) | ,, | 2 ,, |
| 10. సిమెంటు | ,, | 5 ,, |
| 11. గోనెసంచులు | ,, | 3 ,, |
| 12. బంగారం, వెండి | ,, | $\frac{1}{4}$ ,, |
| 13 వెండి బంగారు (నగలు, నగల లోని రాళ్లుగాక ముత్యాలు) | ,, | $\frac{1}{4}$ ,, |
| 14. ప్రత్తి నూలు | ,, | $\frac{1}{2}$ ,, |

| సరుకు వివరం | ఏ పాయింటు వద్ద పన్ను | పన్ను రేటు రు. 1కి |
|---|---|---|
| 15. పంచదార | ,, | 8 ,, |
| 16. కిరోసిన్ ఆయిల్ | ,, | 3 ,, |
| 17. బెల్లం | ,, | 3 ,, |
| 18. రసాయనిక ఎరువులు, ఎముకల పొడి, నూనె (పిండి) కేక్ | మొదటి పాయింటు వద్ద మాత్రం | 3 న. పైసలు |
| 19. వేరుశనగ నూనె | ,, | 2 ,, |
| 20. దేశవాళీ మత్తుపానీయాలు | ,, | 3 ,, |
| 21. అదిగాక మిగతా మత్తుపానీయాలు | ,, | 25 ,, |
| 22. నల్లమందు, గంజాయి, భంగ్ | ,, | 3 ,, |
| 23. ప్రత్తి (విత్తనాలు) గింజలు | ,, | 2 ,, |
| 24. సిగరెట్లు (10 సిగరెట్లు 31 నయా పైసకు లోపు చిల్లరగా అమ్ముడైయేవి) | ,, | 8 ,, |
| 25. సిగరెట్లు (10 సిగరెట్లు 31 నయా పైసకుగాని అంతకు మించిగాని చిల్లరగా అమ్ముడైయేవి) | ,, | 16 ,, |
| 26. చుట్టలు - చెరూట్సు చిల్లరగా ఒక్కొక్కటి 12 న. పైసలుకు తక్కువ అమ్మేవి | ,, | 3 ,, |
| 27. చుట్టలు ఒక్కొక్కటి 12 న. పైసలుకు గాని ఎక్కువకుగాని అమ్మకమైనవి | ,, | 16 ,, |
| 28 పైప్ పొగాకు లేక సిగరెట్ పొగాకు | ,, | 16 ,, |
| 29. బీడీలు, ముక్కుపొడి, నమిలేపొగాకు లేక యితర పొగాకు పదార్థం | ,, | 3 ,, |
| 30 చెముకున్నవా రుపయోగించే ఎలక్ట్రిక్ యంత్రం | ,, | 3 ,, |
| 31. మిల్లునూలుతో నేసిన చేనేతబట్ట | ,, | 1 ,, |
| 32. అభ్రకం | ,, | 3 ,, |

3 వ షెడ్యూలు : సెక్షన్ 5 (3) (బి) ప్రకారం సింగిల్ పాయింటు కొనుగోలు పన్ను పడేవి. వీటికి కనిష్ట టర్నోవరు 10,000 తో నిమిత్తం లేకుండా పన్ను చెల్లించాలి.

| సరకు | పన్ను పడే పాయింటు | పన్ను రేటు రు. 1కి |
|---|---|---|
| 1. మేంగనీస్ (దాని రాతితో సహా) | స్టేట్ లో కొనే ఆఖరు వర్తకునివద్ద | 4 న. పైసలు |
| 2. ఇనుపరాయి | ,, | 3 ,, |
| 3. దేశవాళీ పుగాకు | స్టేట్ లో కొనేమొదటి వర్తకుని వద్ద | 3 ,, |
| 4. వర్జీనియా పుగాకు | ,, | 4 ,, |
| 5. ధాన్యం | ,, | 3 ,, |
| 6. బియ్యం ♦ | ,, | 3 ,, |
| 7. కొబ్బరికాయలు | ,, | 3 ,, |
| 8. కురిడీలు | ,, | 3 ,, |
| 9. పసుపు | ,, | 6 ,, |
| 10. మెట్టధాన్యాలు (మిల్లెట్సు) (కొర్రలు, జొన్నలు, సామలు, అరికెలు, సజ్జలు) | ,, | 2 ,, |

♦5 వ పద్దు ప్రకారం ధాన్యంమీద పన్ను చెల్లించబడితే తర్వాత అది బియ్యంరూపంలోకి మారితే 6 వ పద్దుప్రకారం యికను పన్ను చెల్లించ నక్కరలేదు.

4 వ షెడ్యూలు : కేంద్రచట్టం ప్రకారం డిక్లేర్డు గూడ్సు సింగిల్ పాయింటు పన్ను 6 వ సెక్షన్ ప్రకారం కనిష్ట టర్నోవర్‌తో నిమిత్తం లేకుండా చెల్లించవలసినవి.

| | సరుకు వివరం | పన్ను పడే పాయింటు | పన్ను రేటు రు. 1కి |
|---|---|---|---|
| 1. | రాక్షసిబొగ్గు, కోక్ | రాష్ట్రంలో మొదటి అమ్మకంవద్ద | 2 నయాపైసలు |
| 2. | ఇనుము, ఉక్కు వాటి సామానులు | డిటో | ,, |
| 3. | నూనెగింజలు | మొదటి కొనుగోలుమీద | ,, |
| 4. | జనపనార | డిటో | ,, |
| 5. | ప్రత్తి | నూలుమిల్లు కొంటే మిల్లు నుండి లేకపోతే ఆఖరున స్టేట్‌లో కొన్నవానినుండి వసూలు చేయబడును. | ,, |
| 6. | తోళ్ళు, చర్మాలు (ఎ) బాగుచేయనివి | స్టేట్‌లో టానింగ్ చేసేవాడు కొన్నపుడు అతనివద్ద వసూలు చేయబడును. మిగతా బేరాల్లో స్టేట్‌లో ఆఖరునకొన్న వానినుండి పన్ను వసూలుచేయబడును. | ,, |
| | (బి) బాగుచేయబడి నవి బాగుచేయ బడని దశలో పన్నుకట్టినవి) | పరిశ్రమదారుకొంటే అతనివద్ద పన్ను వసూలు చేయబడును ఇతర బేరాల్లో ఆఖరు డీలరు వద్ద. | ,, |

**5** వ షెడ్యూలు : ప్రత్తినుండి మినహాయింపబడినవి. సెక్షన్ 8 ప్రకారం.

---

1. ఉప్పు.
2. విద్యుచ్ఛక్తి
3. మోటారు స్పిరిట్సు
4. కల్లు

---

# 4 వ అనుబంధం

గెజెట్‌లో (15-6-57) ప్రకటింపబడిన నోటిఫికేషనులు :

I ఈ చట్టం 15-6-57 నుండి అమలులోకి వస్తుంది.

II (ఎ) సాలుకు రు. 50,000 మించని టర్నోవర్ గలవారికి అసిస్టెంట్ కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరున్నూ,

(బి) ఆ పైన రు. 5 లక్షల వరకు డిప్యూటీ కమ్మర్షియల్‌టాక్సు ఆఫీసరున్నూ,

(సి) ఆ పైవారికందరికి కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరున్నూ పన్ను విధించవలెను.

III .............

IV నుండి XII వ రూలువరకు యీ పన్నునుండి మినహాయించిన వస్తువుల జాబితా :

మొక్కజొన్నకండెలు, గడ్డి, పాలు, పెరుగు, పువ్వులు, గుడ్లు, మాంసం, పండ్లు (బంగాళాదుంపలు, ఉల్లిపాయలు మినహా మిగతా), కూరలు, చేపలు, చరఖాలు, కోల్‌సైట్, మట్టిపని, గ్రావల్, క్వారీ కంట్రాక్టులు, ఎక్స్‌రేఫొటోలు, వైద్యులు స్వయంగా యిచ్చే మందులు, పిల్లలు వ్రాసుకొనే

పలకలు, బలపాలు, ఇండియా ప్రభుత్వ ప్రచురణలు, విశ్వ విద్యాలయం ప్రకటించిన పుస్తకాలు, బైబిల్, ఖురాన్, వేదం, పురాణం, దివ్యజ్ఞాన పుస్తకాలలో మాత్రమే ప్రత్యేకంగా వ్యాపారం చేసేవారు, శుద్ధఖద్దరు, కోపరేటివ్ సొసైటీలు, ఖాదీబోర్డు వ్యవహరించే దంపుడు బియ్యం, ప్రత్యేకంగా చేనేత బట్టలోవర్తకంచేసేవారు, పన్ను చెల్లించబడినధాన్యంతాలూకు ఊక, దూగర, విద్యాలయాల్లోని వసతిగృహాలు, ప్రత్యేకంగా చేతి గానుగనూనె వ్యాపారం చేసేవారు.

V నుండి XII వరకు............

XIII XIV రూపాయికింత అని లెక్క కట్టకుండా.

బంగాళా దుంపలకు టర్నోవరు 15,000 రూ॥ మించక పోతే రు. 96/- ఆపైన రు. 20,000 మించకపోతే రు. 144/-

ఉల్లిపాయలకు 12,500 మించకపోతే రు. 48/- ఆపైన రూ. 20,000 మించకపోతే రు.72/- పన్నుకట్టాలి.

XV నుండి XVIII వరకు....................

జి. వో. Ms: No. 1136 రివిన్యూ 14-6-57. శ్రీ వి. సత్యనారాయణ (ఛైర్మన్), శ్రీ పి. యస్. నారాయణరావు, శ్రీ జి. రామదాసుగార్లు (మెంబర్లుగా)అప్పిలేట్ ట్రిబ్యునల్ ఏర్పాటు చేయడమైనది.

# 5 వ అనుబంధం

## నిబంధనలు

15-6-57 గజెట్‌లో ప్రచురితము

1, 2, 3........

4. అప్పిలేట్ ట్రిబ్యునల్: ఛైర్‌మన్‌గాక మిగతా ఇద్దరిలోఒకరు డిప్యూటీ కమిషనర్ (కమ్మర్షియల్ టాక్సెస్)కు తక్కువగాని ఆఫీసరున్నూ, రెండోవారు ఈ డిపార్టుమెంటు ఆఫీసరు గాకుండా యికముందు నిర్ణయింపబడే అర్హతలుగల్గి, ఎకౌంట్సులో అనుభవంగలవారై వుండాలి.

5. ఈ దిగువ వస్తువులకు కొనుగోలుపై పన్ను విధించ బడును.

(ఎ) మేంగనీస్ (ఓర్‌తోసహా), (బి) ఇనుపరాయి, (సి.-డి.) దేశవాళి లేక వర్జీనియా పుగాకు – క్యూర్ చేసినా చేయకపోయినా, (ఇ) ధాన్యం, (ఎఫ్) బియ్యం – ధాన్య రూపంలో పన్ను విధింపబడిందిమాత్రం, (జి) కొబ్బరికాయలు, (హెచ్) కొబ్బరి కురిడీ, (ఐ) పసుపు, (జె) తృణధాన్యాలు, (మిల్లెట్స్), (కె) నూనె గింజలు (కొన్ని షరతులకు లోబడి), (యల్) జనపనార (డిటో ప్రకారం) (యం) ప్రత్తి (డిటో

ప్రకారం), (యన్) చర్మాలు - తోళ్ళు (శుద్ధి చేసినా, లేక పోయినా).

6. (1) పన్ను కట్టేముందు టర్నోవరునుండి యీ దిగువవాటిని మినహాయించాలి. డిస్కౌంటు, వాపసులు, ఖాతాదారు సదుపాయం నిమిత్తం మరొక వర్తకునినుండి తెచ్చి తాను లాభం వేసుకోకుండా ఆనాడే సప్లయి చేసినవి, షెడ్యూలు V లో సరుకులు. సెక్షన్ 9 (1) క్రింద ప్రకటింపబడినవి, 11 వ సెక్షన్ ప్రకారం పొందిన లైసెన్సులోని షరతులప్రకారం చేసిన వ్యాపారం, బిల్లులో ప్రత్యేకంగా చూపబడిన రవాణా ఖర్చులు, ప్యాకింగ్, డెలివరీ మరియు అట్టి ఛార్జీలు, సెంట్రల్ సేల్సు టాక్సు చట్టం వర్తించే వస్తువులు, 25 వ రూలు ప్రకారం వేరుసెనగ నూనె ఆడేవారికి మినహాయించినవి, చుట్టలు, ముక్కుపొడుము తయారు చేసేవారికి 26 వ రూలుప్రకారం మినహాయించినవి.

(2) వర్క్సు కాంట్రాక్టులలో ఉపయోగించిన సరుకుల ప్రత్యేకమొత్తం చూపించలేకపోతే రివిన్యూబోర్డువారు అప్పుడపుడు ఒక్కొక్క ప్రదేశానికి కూలిపనుల కెంతశాతం మినహాయించి కంట్రాక్టుమొత్తంమీద పన్ను విధించవలెనో నిర్ణయిస్తారు. వారు చేసే నిర్ణయాలు ఈ దిగువ గరిష్ఠశాతముకు లోబడిమాత్రం వుండాలి.

| | |
|---|---|
| (ఎ) ఎలక్ట్రో ప్లేటింగ్ లేని ఎలక్ట్రికల్ | శాతం |
| కాంట్రాక్టులకు | 20 |
| ఎలక్ట్రో ప్లేటింగ్ కైతే | 27 |
| నిర్మాణాల కాంట్రాక్టు | 30 |

| | |
|---|---|
| శానిటరీ కాంట్రాక్టు | $30\frac{1}{8}$ |
| గుడ్డల ప్రింటింగ్ - ఛాయఅద్దకం | 50 |
| వాచీలు, గడియారాల మరమ్మతు | 50 |
| కళాత్మకమైన విగ్రహాలు, బొమ్మల కాంట్రాక్టు | 70 |
| యితర కాంట్రాక్టులు | 30 |

7. బ్రాంచీలుంటే అన్ని బ్రాంచీల టర్నోవర్ లెక్కలు హెడ్డాఫీసునుండే డీలర్ రిటరన్ దాఖలుచేయాలి. బ్రాంచీలుగూడా హెడ్డాఫీసు లెక్కలో కల్పబడినదని వ్రాస్తూ తమ లెక్కలుగూడా విడిగా పంపాలి.

8-9. ఫారం - ఎ లో యీ ఆక్టు అమలులోకి వచ్చిన 30 రోజులలోగా పాతవారు రిటరన్ పంపాలి. కొత్తగా వ్యాపారం పెట్టబోయేవారు పెట్టిన 30 రోజులలోగా అంచనా టర్నోవరు రు. 10,000 కు తక్కువ వుండదనితోస్తే పంప వలెను. 17 వ రూలు క్రిందకు వచ్చేవారు కాజుయల్ ట్రేడర్సు పంపనక్కర లేదు.

10.........

11-12. రిటరన్ 8, 9 రూల్సు ప్రకారం పంపక పోయినా, పంపినది సవ్యంగా గాని, సంపూర్తిగా గాని లేక పోయినా డీలర్ సంజాయిషీ యిచ్చుకోడానికి అవకాశమిచ్చి ఆఫీసరు దరియాప్తు చేసి, తాను ఆలోచించి, పన్ను తాత్కాలికంగా విధించవలెను; రిటరన్ అసలే పంపనపుడు తుది నిర్ణయంగానే పన్ను విధించవలెను.

13. నెలవారీ వాయిదాల్లో పన్ను చెల్లించమని ఫారం 'బి' లో ఆఫీసరు నోటీసు యివ్వాలి.

14. (1) కాజువల్ డీలరు యీ స్టేట్‌లో ప్రవేశించిన 24 గంటలలోగా తన మకాం, ఎడ్రసు, వర్తకం చేయబోయే సరుకు స్వభావం, ఇక్కడ వుండదలుచుకున్న కాలం అధికారికి తెలపాలి.

(2) ఇతను స్టేట్‌ను విడిచేరోజునగాని అంతకుముందుగాని 5, 6 సెక్షన్‌ల క్రింద, 9 (1) సెక్షన్‌బట్టి చేసిన నోటిఫికేషన్ క్రింద ఖజానాలో పన్నుకట్టి ఆ రశీదును జతపర్చి రిటరన్ దాఖలు చేయాలి.

(3) అట్లా జరగకపోతే 12 వ రూలు ప్రకారం పన్ను విధించి ఫారం బి-4 లో డిమాండు నోటీసును ఆఫీసరు జారీ చేయవలెను.

15. సాలు మధ్యవ్యాపారం ఆపివేస్తే నాటివరకు బాకీ పన్ను చెల్లించి ఆపివేసిన 30 రోజులలోగా ఆఫీసరుకు తెలుపాలి.

16. .............

17. ఈ రూలుక్రింద రు. 50,000 మించిన టర్నోవరు గల వర్తకులు రిటరన్ పంపడానికి, పన్నుకట్టడానికి తమ కనుకూలమైతే ఒక ప్రత్యేక పద్ధతిలోనికి సాలు ప్రారంభానికి 30 రోజులు ముందుగా కోరి-మార్పించుకోవచ్చును. కమ్మిషియల్‌టాక్సు ఆఫీసరు అంగీకరిస్తే 3 నెలల లోపునకూడా మార్పించుకోవచ్చు.

ప్రతినెలా 25 వ తేదీనగాని, అంతకు ముందుగాని ఫారం ఎ-2 లో రిటరన్ పంపుతూ, ఆ నెలకు పన్ను ఖజానాలో కట్టి రశీదుగాని, క్రాస్‌చేసిన బ్యాంకు చెక్కుగాని జతపర్చాలి.

సాలాఖరున లెక్కలన్నీ తేల్చి ఎవరికెవరు బాకీవున్నా ఇచ్చి పుచ్చుకోడాలు జరిపించుకోవాలి. డీలరు బాకీపడితే ఫారం బి-3 లో ఆఫీసరు నోటీసు పంపును. డీలరుకు రిఫండ్ యివ్వవలసివుంటె ఫారం - సి లో ఆఫీసరు నోటీసు పంపును.

18. రిటరన్‌లోని టర్నోవరు ఆఫీసరు అంగీకరించక మరోవిధంగా పన్నుకట్టితే దానికి కారణాలు వివరింపబడిన ఆర్డరు కాపీ డీలర్‌కు యివ్వాలి.

19. నగదుకు గాక ఇతర ప్రతిఫలానికి డీలరు సరుకును కొన్నా, అమ్మినా వాటి వివరములు రిటరన్‌లో ప్రత్యేకంగా చూపించాలి. ఆ ప్రతిఫలానికి నగదు విలువ ఆఫీసరు నిర్ణయించి పన్ను విధించవలెను. దీనిమీద అప్పీలు చేసుకోవచ్చును.

20 -24. . . . . . . . .

25. వేరుశనగ కాయలుగాని, పప్పుగాని కొని నూనె, పిండి తయారుచేసేవారు ప్రత్యేకంగా ఆఫీసరువద్ద రిజస్టరు చేయించుకోవచ్చును. తన మొత్తం టర్నోవర్‌లో ఆ నూనె కలిసివుండి, దానికి పన్ను చెల్లింపబడివుంటే, ఆ నూనెకోసం మాత్రమే కొన్న కాయల, గింజల ఖరీదు మినహాయింపు పొందడానికి అతనికి అర్హత వున్నది.

ఈ దిగువ వివరణ ప్రకారం వచ్చిన మొత్తంగాని, జమాఖర్చు పుస్తకాల ప్రకారం వచ్చిన మొత్తంగాని ఏది తక్కువైతే అదే మినహాయించాలి.

వివరణ: (ఎ) 143 పౌనుల వేరుశనగకాయలు 100 పౌ॥ పప్పుతో సమానం. (బి) 143 పౌ॥ కాయలుగాని,

100 పౌ॥ పప్పుగాని ఆడితే 40 నూనె దిగుబడి వస్తుంది. (సి) 500 పౌ॥ నూనె ఒక కాండీక్రింద లెక్క మినహాయింపుకు దరఖాస్తు పెట్టుకొన్న నెలలో ఆడిన నూనెకు ఆ నెలలోనే కొన్న ముడిసరుకు ఖరీదు లెక్కలోనికి తీసుకోబడును. ఆ నెలలో ఏమీ కొనకపోతే అంతకుముందు తాను చేసిన ఖరీదులలో ఆఖరుపద్దు లెక్కలోకి తీసుకోబడును. ఫారం VII లో ఈ డీలరు ప్రతినెల 25 తేదీ దాటకుండా వెనకటి నెల జమా ఖర్చులు ఆఫీసరుకు దాఖలుచేయాలి. వీటిలో ఏ షరతులైనా పాటించకపోతే కమర్షియల్‌టాక్స్ ఆఫీసరు దరియాప్తుచేసి, లెక్కల పుస్తకాలు సరిగా వుంటే క్షమించచవచ్చు. రిఫైన్డునూనెకు యీ రూల్సు వర్తించవు. పిండి అమ్మకానికి ఏ మినహాయింపులు లేవు.

26. చుట్టలు, చెరూట్సు, ముక్కుపొడుం తయారు చేసే డీలర్లు, టర్నోవర్ రూ. 12,000 మించకపోతే - ప్రత్యేకంగా ఆ వస్తువుల్లో మాత్రమే వ్యాపారం చేసేవారైతే, మొత్తం టర్నోవరులో యీ వస్తువులు చేరి పన్ను చెల్లించడం జరిగితే, యీ వస్తువులకోసం ఉపయోగించిన పుగాకు ఖరీదు మినహాయింపుపొందడానికి వారికి అర్హతగలదు.

27. వివిధవర్గాల పన్ను రేట్లుగల వస్తువుల్లో వ్యాపారం చేసే వర్తకుడు ఆయా వర్గాల ప్రకారం రిటరన్‌లో విడివిడిగా టర్నోవర్ల మొత్తాలు, నికరాలు ఉదహరించవలెను.

28. చట్టంలో 12 వ సెక్షన్ ప్రకారం డీలర్లంతా రిజిస్ట్రేషన్‌కు దరఖాస్తును (ఫారం 'డి' లో) ఈ రూల్సు ప్రకటించిన 30 రోజులలోగా రు. 6/- ఖజనాలో చెల్లించి పెట్టు

కోవాలి... ప్రతి కొత్త సం॥రం ప్రారంభంలోను 30 రోజులు దాటకుండా రిజిస్ట్రేషన్ రిన్యూయల్‌కు మరల రు. 6/- కట్టి దరఖాస్తు పెట్టుకోవాలి... దీని ప్రకారం పొందిన రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్ పోతే 50 న. పై. ట్రెజరీలో కట్టి డూప్లికేట్ పొందాలి......ఒకరి వ్యాపార సంస్థను మరొకరు కొను క్కుంటే ఫీజుకట్టి కొత్తగా రిజిస్టరు చేయించుకోవాలి. పాతది పనికిరాదు. వ్యాపార స్థలం మారితే, మారిన 15 రోజులలోగా సర్టిఫికేట్‌లో సవరణ చేయించుకోవాలి. ఒక డీలరు కొత్తగా ఫరంలో వాటాదారుగా ప్రవేశిస్తే, ఇతని పాత రిజిస్ట్రేషన్ కొత్త ఫరంకు ఉపయోగపడదు; కొత్తగా మరల రిజిస్టరు చేయించుకోవాలి......సర్టిఫికేట్‌లో ఉదహరింపబడని ప్రదేశములలో డీలరు సరుకులను నిల్వ వుంచరాదు.

29. చట్టం యొక్క షెడ్యూల్సు II, III, IV, లలో వ్యాపారం చేసే డీలర్సు స్టోరేజ్ గోడవునులకుతప్ప మిగతా తమ వ్యాపారస్థలము లన్నిటికి (బ్రాంచీలు) ఆరేసి రూపాయలు చొప్పున చెల్లించి విడి విడిగా రిజిస్ట్రేషన్ లైసెన్సుపొందవలెను...వీరినుండి సాలువారీ అంచనా పన్నులో సగంకు మించకుండా ట్రెజరీలో డబ్బు డిపాజిట్ చేయమని లేదా ఇతర సెక్యూరిటీ యిమ్మని ఆఫీసరు కోరవచ్చు.

30 11 వ సెక్షన్ ప్రకారం మినహాయింపు కోరదలచిన కమిషన్ ఏజంటు లేక బ్రోకర్ రిజిస్ట్రేషన్ దరఖాస్తు ఫారం డి-2 లో పెట్టు తన (ప్రతి వ్యాపార స్థలానికి) బ్రాంచీలకు, హెడ్డాఫీసుకు విడివిడిగా లైసెన్సులు పొందాలి......30 రోజుల గడువు దాటేక పెడితే పెట్టిన తేదీనుండి సాధారణంగా

లైసెన్సు యివ్వబడును. ఆ సం॥రంలో యింకెన్ని రోజులు మిగిలితే అన్ని రోజులకే అది చెల్లును. కొన్ని న్యాయమైన సందర్భాలలో గడువుదాటక వచ్చిన దరఖాస్తుదారులకు గతంనుండి చెల్లుబడి అయ్యేవిధంగా కొత్త లైసెన్సుగాని రిన్యూయల్‌గాని ఫీజుకు 9 రెట్లుకు మించకుండా పెనాల్టి విధించి కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు తన క్రింది ఆఫీసరును ఆదేశించవచ్చును......ఈ లైసెన్సు ఫీజు గరిష్ఠ ప్రమాణం రు. 1000/- మించకుండా యీ క్రింది తరగతులవారీగా వుండును.

| | |
|---|---|
| రు. 25000 టర్నోవరు మించకపోతే | రు. 50/- |
| రు. 25000 నుండి 50000 వరకు | 100/- |
| రు. 50000 నుండి లక్ష రూ. వరకు | 200/- |
| ఆ పైన ప్రతి లక్షకు గాని లక్షలో భాగానికి అదనంగా గాని | 100/- |

1957-58కి అదివరకే పాతచట్టాల ప్రకారం చెల్లించబడిన ఫీజును యీ ఫీజులో భాగంగా జమకట్టవచ్చును. ఈఫీజులు చెల్లించిన రశీదులుగాని, క్రాస్‌చెక్కులుగాని దరఖాస్తుతో జతపర్చవలెను. లెక్కలు ఆఖరున తేలిన తర్వాత యీ కట్టిన దానిలో యిచ్చి పుచ్చుకోడాలు అవసరమైతే చేయవచ్చును పోయిన లైసెన్సుకు డూప్లికేట్ కావలిస్తే రు. 1-0-0 ఫీజు. ఫారం VII లో సాలాఖరైన 30 రోజులలోగా రిటరన్ దాఖలుచేయవలెను.

31. పన్నుల, ఫీజులనుండిగాని, వాటిలో కొంతభాగాన్నుండిగాని తప్పించుకున్నవారికి 4 ఏళ్ళలోపున పట్టుబడితే

నోటీసు పంపి, సంజాయిషీ విని ఆఫీసరే ఆ ఫీజు నిర్ణయించి విధించును.

19, 20 సెక్షనుల ప్రకారం అప్పీళ్ళు, రివిజన్ పిటిషనులు విచారించే అధికారులకు గూడా 4 ఏళ్ళ వరకు ఇట్టి అధికార ముండును.

## అప్పీళ్లు - రివిజనులు

33. అసిస్టెంట్ కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు తీర్పుమీద కమ్మర్షియల్ టాక్స్ ఆఫీసరుకు, డిప్యూటీ కమర్షియల్ టాక్స్ ఆఫీసరు తీర్పుమీద డిప్యూటీ కమిషనర్‌కు అప్పీలు చేసుకోవచ్చును...తనకు తానుగా గాని పిటిషన్ వచ్చినమీదగాని రివిన్యూబోర్డు కారణములను రికార్డుచేసి అప్పీలును ఒక అధికారినుండి మరొక అధికారివద్దకు బదిలీ చేయవచ్చును ... అప్పీలు ఫారం I లో రు. 3/- కోర్టుఫీజు స్టాంపుతో (రిజిస్టర్ పోస్టులోనైనా సరే) పంపవలెను.

34. ............

35. ఆసామీకి రిఫండ్ ఇవ్వవలసివస్తే అప్పీలు, రివిజన్ ఆర్డరు జారీ అయిన రెండు నెలలలోగా యిచ్చివేయవలెను.

36.........

37.........

38. 21వ సెక్షన్ ప్రకారం ట్రిబ్యునల్‌కు దాఖలు చేసే అప్పీళ్ళు ఫారం II లో వుండాలి. నాలుగేసి కాపీలు దాఖలు చేయాలి. ఎంత మొత్తం తగాయిదాలో వుందో అంతకు

నూటికి రు. 1/- చొప్పున ట్రెజరీలో అప్పీలు ఫీజు చెల్లించి చలానాగూడా పంపాలి. కాని ఈ ఫీజు రు. 25/- కు తక్కువ గాకుండా రు. 100/- కు మించకుండా వుండాలి. ఈ ఫీజులో అంతాగాని కొంతగాని తనకు న్యాయమని తోచిన కేసులో ట్రిబ్యునల్ రిఫండ్ చేయమనవచ్చును.

39, 40. ట్రిబ్యునల్ తీర్పుమీద హైకోర్టులో రు. 100/- ఫీజు చెల్లించి ఫారం III లో 90 రోజులలోగా పిటిషన్ దాఖలు చేయవచ్చును.

41. రెవిన్యూబోర్డు ఆర్డరుమీద హైకోర్టుకు దాఖలు చేసే అప్పీలు ఫారం IV లో 60 రోజులలోగా రు. 100 ఫీజుతో దాఖలు చేయాలి.

42. కొత్తగా మరికొన్ని యథార్థములు బైటపడడం వల్ల ట్రిబ్యునల్ ఆర్డరును (రివ్యూ) పునర్విమర్శించమని హైకోర్టుకు ఆసామీగాని, అధికారిగాని పెట్టుకొనే పిటిషన్, ఫారం V లో ఒక సంవత్సరం లోపున దాఖలుచేయాలి. ఆసామీ దాఖలుచేస్తే రు. 100 ఫీజు కట్టాలి... అలాగే రెవిన్యూబోర్డు ఆర్డరుమీద హైకోర్టుకు పెట్టుకునే రివ్యూ పిటిషన్ ఫారం VI లో దాఖలుచేయాలి. ఫీజు, గడువు అంతే.

43.........

44. 20 వ సెక్షన్ ప్రకారం కమ్మర్షియల్‌టాక్స్ ఆఫీసరు మూడేళ్ళలోపున, డిప్యూటీ కమిషనర్‌గాని రెవిన్యూబోర్డుగాని నాలుగేళ్ళలోపున తమకు తామే క్రింది అధికారుల నుండి రికార్డు తెప్పించి కొత్త ఆర్డర్లు జారీ చేయవచ్చు.

# లెక్కలు

45. భారత రాజ్యాంగం ఎనిమిదవ షెడ్యూలులోని 14 భాషలలోను లెక్కలు వ్రాసుకోవచ్చు... లెక్కలు యథార్థముగా వుంటూ యీ దిగువ వివరములు చూపాలి. ఉత్పత్తి చేసిన, తయారుచేసిన, కొన్న, అమ్మిన సరుకుల వివరం...ఎవరినుండి కొనెనో వారి బిల్లు తారీఖు, సంతకం ఉండాలి. సింగిల్ పాయింట్ టాక్సు చెల్లించే ప్రతివారు ప్రతి అమ్మకానికి బిల్లు ఇచ్చి తీరాలి. 20,000 మించి సాలీనా అమ్మకముండే ఇతరులుగూడా రు. 5/- మించిన అమ్మకానికి బిల్లు యివ్వాలి. కొనేవా రడిగితే అంతకు లోపునైనా యివ్వాలి ... బిల్లు లన్నింటికి వరుస నెంబరు సాలువారీగా వుండాలి. బిల్లు నకళ్ళు జాగ్రత్త పర్చాలి. బిల్లులమీద అమ్మినవారి పేరు తేదీ సంతకం వుండాలి. టోకున అమ్మితే, కొన్నవారి పూర్తి అడ్రసు వ్రాయాలి ... చిల్లర వర్తకునికి అమ్మిన సరుకులకు బిల్లు లేకపోతే ఫారం X లో డూప్లికేటుగా డెలివరీనోట్ యివ్వాలి. ఈ డెలివరీ నోట్లన్నింటికి సాలువారీగా వరుస నెంబరు వేయాలి. ... షెడ్యూల్సు II, III, IV ల లోని సరుకుల వ్యాపారం చేసే ఆసామీ, తాను స్టేట్‌లో ఆ సరుకులలో మొదటి వ్యాపారస్థుడు కాకపోతే, తనకు అమ్మినవారి వద్ద నుండి ఫారం XI లో డిక్లరేషన్ పొందవలెను. దాని ప్రకారం ఆ సరుకులకు సింగిల్‌పాయింట్ పన్ను అదివరకే చెల్లింపబడి నట్టు రుజువు చేయవలెను. ... సెక్షన్ 11 ప్రకారం లైసెన్సు తీసుకున్న కమిషన్ ఏజంటు ఇతరులకోసం ఏజంటుగా పని

చేయడమే గాకుండా తాను స్వయంగా వ్యాపారం సాగించే యడల దానికి ప్రత్యేక లెక్కలు పెట్టవలెను ... ఈ చట్టం క్రింద వేరు వేరు పన్ను రేట్లు చెల్లించవలసిన సరుకులకు వేరు వేరు లెక్కలు చూపించవలెను. లెక్కలన్నీ 4 ఏళ్ళ వరకు జాగ్రతపర్చాలి.

### చెక్ పోస్టులు

46. ఎక్కడెక్కడ చెక్ పోస్టులు, బారియర్లు కట్ట వలెనో ప్రభుత్వం గెజెట్‌లో ప్రకటిస్తుంది. అట్లా ప్రకటింప బడిన స్థలాలలో రవాణా అవుతున్న సరుకులను తనిఖీ చేయు డానికి ఆఫీసర్లను ఏర్పాటు చేయుదురు. ఇట్టి ఆఫీసర్లుగాని, అసిస్టెంట్ కమర్షియల్ టాక్సు ఆఫీసరుకు తక్కువగాని హోదా గల మరొక ఆఫీసరుగాని కోరినంత కాలం సరుకులు తీసుకు పోతున్న డ్రైవరు లేక కళాసు తన బండిని లేక పడవను ఆపాలి. ట్రిప్‌షీట్‌కు బిల్లుకు లాగ్ బుక్‌కు అదనంగా తని ఖీలో దొరికిన సరుకులకు ఆఫీసరు రశీదిచ్చి దించివేయించ వచ్చు. ఆ సరుకులను ప్రభుత్వపరం చేసేముందు ఆఫీసరు ఆ యజమానికి సంజాయిషీ చెప్పుకొనే అవకాశ మివ్వాలి. ఆ తరు వాత ఆఫీసరు తన ఆర్డరును ఆసామీకి అందజేయాలి. ప్రభుత్వ పరమైన సరుకులు బహిరంగవేలం వేయబడును. ఈ ఆఫీసరు ఆర్డరుమీద అప్పీలు చేసుకోగా లేక రివిజన్ పిటిషన్ పెట్టు కోగా ఆర్డరు రద్దయితే వేలంపాట వగైరాలకు ప్రభుత్వాని కైన ఖర్చులు మినహాయించుకొని మిగతా డబ్బు అతనికి తిరిగి యిచ్చివేయబడును. ఒకవేళ అప్పటికింకా వేలాం జరక్కపోతే సరుకులే వాపసు చేయబడును. ... యజమాని

జాడ తెలియని కారణంగా ప్రభుత్వ పరమైన సరుకుల విషయంలో ఆ యజమానిగాని, అతని ఏజంటుగాని ఆఫీసరు వద్దకు హాజరై ఆ సరుకులు తనవని, వాటికి పన్ను చెల్లింపబడిందని రుజువు చేసుకొంటే ఆఫీసరు కారణాలను రికార్డుచేసి ప్రభుత్వానికైన ఖర్చులను రాబట్టి సరుకును విడుదల చేయవచ్చును.......

47. చెక్ పోస్టుల, బారియర్ లవద్దనే గాకుండా యితర చోట్ల గూడ యీ డిపార్టుమెంటు అధికారి ఎవరైనా అసిస్టెంట్ కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరుకుతక్కువకానివారు సరుకుల రవాణాను ఆపి తనిఖీ చేయువచ్చును. ఆ తనిఖీలో దొరికిన అక్రమ సరుకుల విషయంలో పై విధంగానే ఆఫీసరు చర్య తీసుకోవచ్చు.

48. సెక్షన్ 28 ప్రకారం ఆదేశింపబడిన ఆఫీసరు ఏ కొట్టులోనైనా గోడౌన్‌లోనైనా బండిలోనైనా పడవలోనైనా అక్రమ సరుకులు పట్టుకుంటే పై 46 రూలు ప్రకారమే చర్య తీసుకోవలెను.

49. సెక్షన్ 28 ప్రకారం ఆదేశింపబడిన అధికారి సోదా జేసేప్పుడు సాధ్యమయినంతవరకు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 1898 (కేంద్ర ప్రభుత్వ చట్టం 1898) రూల్సును అనుసరించాలి. పన్ను ఎగవేతకు సంబంధించిన రికార్డు ఆఫీసరుకు దొరికితే ఆసామికి రశీదిచ్చి తాను కొనిపోవచ్చును. తన పైఅధికారిఅనుమతిమీద తప్ప అట్టి రికార్డును తనవద్ద 30 రోజులకు మించి వుంచుకోరాదు.

## ఇతర విషయాలు

50 నుండి, 56 వరకు.........

57. సాక్ష్యంకోసం ఎవరినైనా రప్పించినపుడు వారికి రాకపోక ఖర్చులు యివ్వబడును.

58. లైసెన్సుదారుకుగానీ డీలర్‌కుగాని నోటీసుగాని, ఆర్డరుగాని, సమన్‌గాని జారీ చేసేప్పుడు అతనికిగాని, అతని ఏజంటుకుగాని జారీ చేయడానికి ప్రయత్నించాలి. వారు దొరక్కపోతే ఆఖరున, తెలిసినవారి నివాస స్థలంలో నోటీసు విడిచిపెట్టాలి. లేదా వారి కుటుంబంలోని ఏ మేజరుకైనా ఇవ్వడానికి ప్రయత్నించాలి. ఎడ్రసు తెలిస్తే రిజిస్టరు పోస్టు ద్వారా పంపవచ్చును. ఇందులో ఏవీ సాధ్యం కాకపోతే ఆసామీగా అదివరకెక్కడ ఆఖరుసారి నివసించినట్టు తెల్సిందో అక్కడ ప్రధానమైన స్థలంలో స్పష్టంగా కనిపించేట్టు నోటీసు అంటించాలి.

59. 32 వ సెక్షన్ ప్రకారం వ్యవహరించడానికి అసిస్టెంట్ కమర్షియల్ టాక్సు ఆఫీసరుకు తక్కువ కానివారందరికి అధికారం వుంది.

60. ఏరియా క. టా. ఆఫీసరుకు ప్రతినెలా 15 వ తేదీ దాటకుండా ఆ ఏరియాలోని బ్యాంకులు వాటి బ్రాంచీలు ఒక రిటర్న్ పంపుతూ గత మాసంలో ఇతర రాష్ట్రముల నుండి పైకం వసూలుకోసం తమ వద్దకు వచ్చిన అన్ని బిల్లుల

వివరాలు తెలపాలి. స్టాక్ ఎక్ఛేంజ్‌లోని పేర్సుగురించి తెలపనక్కరలేదు.

61. రిటరన్సులోని స్టేట్‌మెంట్సులోని యితర రికార్డు లోని హంశములన్ని ఆఫీసరు రహస్యంగా వుంచవలెను. తన పై అధికారులుగాని, కోర్టులుగాని, ప్రభుత్వంగాని, యితర రాష్ట్ర ప్రభుత్వాలుగాని, కేంద్రప్రభుత్వంగాని కోరితే వారికి తెలపవచ్చును. ఇతర డిపార్టుమెంట్ల అధికారులు కావలిస్తే ఈ డిపార్టుమెంటు పై అధికారిద్వారా అత్యవసర పరిస్థితిలో తెప్పించుకొనవచ్చు గాని, వారుగూడా రహస్యంగానే వుంచాలి.

62. ...........

63. (1) సెక్షన్ 35 ప్రకారం ఆడిట్ వృత్తిలోనివారు యీ దిగువ యోగ్యతలలో ఏ ఒక్కదానినైనా గలిగివుండాలి.

(ఎ) 1922 ఇన్‌కంటాక్సు చట్టం 61 వ సెక్షన్‌కోసం 1924 సెంట్రల్ రెవిన్యూబోర్డు చట్టం ప్రకారం నియమిత మైన బోర్డువారి ఎక్కౌంటెన్సీ పరీక్ష ప్యాసైవుండాలి.

(బి) కామర్సులోగాని, ఎకనామిక్సులోగాని రికగ్నైజుడు విశ్వవిద్యాలయాల్లో పట్టభద్రుడై వుండాలి. లేక 15-6-'57 కు పూర్వం ఆడిటర్‌గా కేసులో పనిచేసె ఆఫీసరుముందు హాజరై ఆంధ్రప్రదేశ్ రెవిన్యూబోర్డు (వ్యాపార పన్నులశాఖ) వారి అమ్మకపు పన్ను వృత్తిదారుల జాబితాలో చేరివుండాలి.

(2) ఆడిటరులో చెడునడత కనుపిస్తే అతని సంజాయిషి విని, రెవిన్యూబోర్డు అతనావృత్తికి అనర్హుడని ఆర్డరు జారీచేయవచ్చును.

(3) ఇట్టి ఆర్డరు రద్దుచేయమని ఆడిటరు ప్రభుత్వానికి అప్పీలు చేసుకొనవచ్చును. ... ఆర్డరు జారీ అయిన నెలలోపున అమలుకు రాదు. ఈలోగా అప్పీలును ప్రభుత్వం స్వీకరిస్తే, ప్రభుత్వం తుది తీర్పు యిచ్చేవరకు అమలుకురాదు.



134





స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు, విజయవాడ.



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 103B160 |
| పుస్తకం పేరు | ఆంధ్ర ప్రదేశ్ [illegible] |
| తారీఖు | 25.10.24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 137 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 131,133, B |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | thasin |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |